క. పరిచర్య చేయుచుఁ దమ,వరులను దిగనాడి చనిరి ౹ వనితలు; మఱియున్
దరుణులు తినుచు నన్నము విడి, పరుగిడి రాకృష్ణగాన౹పరవశ లగుచున్. ౬ 1665

క. మైపూఁత పూయుకొందఱు, గోపిక లాపనిని మాని ౹ కోరికమీఱన్
శ్రీపతిఁ గనఁ బోయిరి; మఱి, యాపడఁతులు కొంద ఱట్టె ౹ యాతుర లగుచున్.

చ. జలకము లాడుచుండి తమ౹స్వాంతము లాహరిఁగానఁ గోర ని
మ్ముల నడిమాని పోయిరి; ప్ర౹భూతముదంబునఁ గొంద ఱంగనా
తిలకము లంజనం బిడుచు ౹ దృష్టులఁ జక్క నలంకరించుటల్
తలఁపక యట్టెపోయిరి; ని౹తంబిను లింకను గొంద ఱాదృతిన్. ౭ 1667

క. ధరియించు నంబరంబుల, నరయక వ్యత్యస్తరీతి ౹ నటుఁదాల్చియు నా
భరణములఁ దాఱుమాఱుగ, ధరించియుం బోయి రచ్యు౹తప్రభుఁ గనఁగన్. ౭

చ. పతులును దండ్రులున్ సహజ౹బంధుజనంబులు పోవరా దటం
చతిశయమైనశ్రద్ధఁ గొని ౹ యత్తఱి నెంతఁగ నిల్పినన్ మనో
గతుల సరోజనేత్రుఁ డటు౹గాఢతరం బగుశక్తి లాగ మో
హితలయి యాపడంతులు మ౹తేమియుఁ బల్కక నిల్వ కేగినన్. ౮ 1669

ఉ. సుందరు లింకఁ గొంద ఱలు౹సూనశరాసనుతండ్రిఁ జూడఁ బో
వం దగ దంచు లోనఁదగు౹వస్త్యములన్ నిలుపంగ డెందముల్
కుందు గనంగ నుండియు ము౹కుందుని భావనచేయువారె కా
నం దమకప్పు డడ్డపడు౹నాథుల మీఱఁగ రామి భక్తిమై. ౮౪ 1670

ఉ. కన్నులు మూసికొంచు హరిఁ ౹ గాంచనచేలుని గృష్ణమూర్తి నా
పన్నశరణ్యు ధ్యానమున ౹ భావనచేయుచు నట్లెయుండి; రా
కన్నియ లాపరాత్పరునిఁ ౹ గానమిఁ గల్గినదుస్సహవ్యథన్
గ్రన్ననఁ బాపజాలము వి౹కావికలై చన వార లాదృతిన్. ౯౪ 1671

క. ధ్యానప్రాప్తాచ్యుత గురు, మానితరూపంబు నెంతొ ౹ మమత వెలయఁగా
మానసపీఠిన్ నిల్పుచు, శ్రీనిలయంబోట దానిఁ ౹ జెందినపూన్కిన్. ౧౦ 1672

ఆ. కౌఁగిలించుకొనుచు ౹ గాఢతరానంద, మనుభవించి దాన ౹ నఖిలపుణ్య
ములును క్షీణతఁ గన ౹ వెలఁదులు ప్రారబ్ధ, పుణ్యపాపబంధ౹ములు నశింప.౧౦౪

సీ. *పాపనాశకు విష్ణుఁ ౹ బరమాత్మునుంగూడి దాననేగుణమయం౹బైన దేహ
మును బాసి రప్పుడే; ౹ యని శుకయోగీంద్రుఁ డనువదించిన విని ౹ యవనివిభుఁడు
యోగీశ్వరా! పురుషో౹త్తము గోపిక లాశ్చర్యకరసుగు౹ణాభిరాముఁ
గాంతునిగా మదిఁ ౹ గామించిరే కాని బ్రహ్మమేయని కాదు ౹ వార లిట్లు
ఆ. గుణమయమగు బుద్ధిఁ౹గూడినందున నెట్లు, లాగుణప్రవాహ ౹ మంతరించె

* "తమేవ పరమాత్మానం జారబుద్ధ్యాపిసంగతాః" "జారః పాపపతిః" అని త్రికాండశేషము.

సంశయంబుఁ బాపఁ । జను నాకు నని వేఁడ, మౌనివర్యుఁ డనియె । మానవేంద్ర!

క. ఈనీప్రశ్నమునకు మున్నేను వచించితిని గాదె । యెట్లనఁ జైద్యుం
డానళినాక్షుని రిపుగాఁ, దా నెంచియె సిద్ధిగనెఁ । గద యనఁగ వినవే. ౧౩ 1675

క. పగఁగొన్నవారె ముక్తికిఁ, దగియుండఁగ హరికి నెన్న । దగురీతిఁ బ్రియం
బుగఁ గొల్చువారు ముక్తికిఁ, దగరే? యూహింపు మింత । ధన్యుఁడవగుటన్.

క. మనసునకున్ మఱివాక్కునకు నగోచరుఁ డవ్యయుండు । గుణరహితుండున్
వినుతగుణాత్మకుఁడును నగు, వనజాక్షుఁడు లోకమందు । వ్యక్తుఁ డగుటయున్.

క. నరులకు నిశ్శ్రేయసములఁ, గరమరుదుగఁ గల్గఁజేయుఁ । గాక మఱేకా
ర్యరతిం గాదుకదా యవతరించు టున్నంగ భక్త । తతికోసరమే. ౧౪ 1678

క. [1]కనుకం గామమొ క్రోధమొ, యనవరతపు భక్తియో భ । యంబో స్నేహం
బనునదియో యైక్యంబో, వనజాక్షునియందు నెఱపు । వారలు ధన్యుల్. ౧౫

తే. మఱియుఁ దన్మయులగుదురు । మాటలేల?
షడ్గుణైశ్వర్యయుక్తుఁడై । జన్మరహితుఁ
డగుచు యోగీశ్వరేశ్వరుం । డయి చెలంగు
కృష్ణువిషయంబునం దిది । యేమి వింత? ౧౬ 1680

క. స్థావరజంగమములకున్, శ్రీవిష్ణువె ముక్తినొసఁగుఁ । జెప్పఁగ నేలా?
యావాసుదేవునం దిది, యేవరుసం జెల్లు ననుచు । నింకన్ వినుమా! ౧౬ 1681

ఉ. మాటలయందు నేర్పుగల । మానిసులందు జగంబునందుఁ దా
మేటియొ గానఁ దన్నుఁగన । మించినవేడుక వచ్చియున్న యా
బోఁటులఁ గాంచుచున్ మధుర । ముగ్ధవచస్సుల మోహమొందఁగా
గాటపుశక్తిఁ జేయుచును । గాంచనచేలుఁడు పల్కె నివ్విధిన్. ౧౭ 1682

ఉ. మంచి యదృష్టమొప్పఁ దగు । మానిసులార! సుఖాగతంబె? కా
వించు ప్రియంబు గల్గునొకో? । విందుము చేయుదు మల్లగోకులం
బంచితవాసమై యలర । హాయిగనుండురె యెల్లవార; లే
మెంచుచు వచ్చినార లిట । నేము వసింపఁగఁ జెప్పుఁ డింపుగన్? ౧౮ 1683

చ. [2]ఇది క్షప ఘోరరూపయగు । నిందు మహత్తరఘోరజంతువుల్
పొదలెడుఁ గాంతలార! యిఁకఁ । బొండు వ్రజంబున; కీస్థలంబునం
దువిదలు నిల్వరాదు; కన । నుగ్రముగాఁ దగువేళ గావునం
బదపడి చూడఁగాఁదగును । భావములం గలకార్యజాలముల్. ౧౯ 1684

1 "కామంక్రోధంభయంస్నేహ మైక్యంసౌహృదమేవచ, నిత్యం హరౌవిదధతో యాంతితన్మయతాంహి తే" అని మూలము. 2 "రజన్యేషాఘోరరూపా ఘోరసత్త్వనిషేవితా, ప్రతియాత వ్రజం నేహ స్థేయం నేహ సుమధ్యమాః" అనిమూలము.

చ. జననులుఁ దండ్రులున్ సుతులు § సాధుమతుల్ పతు లన్నదమ్ము లో
వనరుహనేత్రలార! యిట § వచ్చిన మీగతి గానలేక చిం
తను బరికించుచుందురు గదా? తగుబంధుల కెప్పుడే భయం
బును గలిగింపకుండుఁ డది § పోలని కార్యముగాదె చూడఁగన్. ౨౦ 1685

మ. అనిపల్కన్ విని వార లించుక సరో§జాక్షోక్తు లాలింప కో
య్యనఁ బ్రేమాగ్రహమూని నల్లడల లీ§లాక్షుంబులం బర్వఁజే
య నిటలంపాధిపవంద్యుఁ డెంచి యను నో§యబ్జాక్షులారా! వనం
బును దర్శించితిరే కదా కుసుమితం§బుల్ జక్కఁగా నిత్తఱిన్. ౨౦౪ 1686

సీ. కుసుమదంభంబున § నెసఁగు వేడుక మిమ్ముఁ బరిహసించెడుఁజూఁడీ § వన మనంగ
వారలు తమదృష్టి § వారంబు మరలించి యాకసంబున నిల్ప § హరియు వారి
కిట్లని పల్కె; రా§కేశుండు వనమందుఁ దనకిరణంబులఁ § దమి చెలంగ
వ్యాపింపఁగాఁజేసి § యీపాటికార్యము మీరొనర్చితిరని § మించుబోఁడు

తే. లార! పరిహాస మొనరించుఁ § గోరి; యనఁగ
వారు యమునను దృష్టులఁ § బర్వఁజేయఁ
గని మఱియుఁ బల్కె యమునయుఁ § గమ్రపవన
చలితతీరావనీరుట్కి § సలయ వితతి. ౨౧ 1687

క. పరిహాస మొప్పఁ జేసెదుఁ, దరుణీమణులార! యనుచుఁ § దామరసాక్షుం
డరయఁగ వారిమనంబులఁ, బరిహాసముగా వచించి § పలికెన్ మఱియున్. ౨౧

క. సతులార! వనము గంటిరి, జతనముమీఱంగఁ బొందు § సదనంబులకున్
బతులకు శుశ్రూషల సమ్మతిఁ జేయుఁడు శాస్త్రవిహితమర్యాద యిదే. ౨౧౪

క. బాలకు లేడ్చుచు నుందురు, పాలీయం దగును వత్స§పటల మఱచుఁగా
నాలను బిదుకుం డయ్యవి, పాలెంతయుఁ దృష్టిఁ ద్రావి § పర్విడుఁజుండీ! ౨౨

చ. అనుటయు గోపికల్ మిగుల § నాతురతం గనుదృష్టి లొప్పఁగాఁ
దనుఁ గనుఁగొంచి యి ట్లనియెఁ § దామరసాయతనేత్రలార! మీ
మనములు నాపయిం గలుగు § మక్కువచేతనె యంత్రితంబులై
తనరునయేని ప్రీతిమెయి § దానికి నన్ననవచ్చు టొప్పఁగా. ౨౨౪ 1691

చ. ననుఁ గనవచ్చు టెంతయును § న్యాయమె యేలన సర్వమందు నేఁ
గనఁబడుచుందు నాపయిని § గాఢముదంబును బొందుజంతువుల్
కనుకనె; మీకు నాయెడలఁ § గల్గినప్రీతియు యుక్తమే యగున్
గ్గనఁబడ దానిఁజేసితిరి § క్రమ్మఱి పొం డిఁక గోష్ఠసీమకున్. ౨౩ 1692

మ. పరమేశుం డిటుపల్కి శాస్త్రహితముం § బాటించుచుం బల్కె నీ
ధరణిన్ నిష్కపటంబుగా సుదతు లా§త్మస్వామికిన్ బ్రీతిమైఁ

బరిచర్యల్ సలుపం దగుఁ విహితమై భాసిల్లు సద్ధర్మ మి
క్కరణిం బొల్పు నటంచు శాస్త్రములు వాక్రుణించెదుం గంటిరే? ౨౩౪

తే. పరమకల్యాణులార! తోఁబుట్టుఁ బంధువులకుఁ
బ్రియము గూర్చుట మేలగు బిడ్డలను గ
నికర మొప్పఁ గాపాడుటె నీతి మఱియు
ధర్మసూక్ష్మములను వినఁ దగును మీకు ౨౮ 1694

సీ. [1]కలహించు టాదిగాఁ గల్గినదుర్గుణములు గలవాఁడైన లలితరూప
విరహితుఁడైన నిర్వీర్యుఁడైనను వృద్ధుఁడైనను గార్య మెయ్యది యకార్య
మగు నిదంచు నెఱుంగనట్టివాఁడైనను భగ్నాంగుఁడైన నల్పతనుఁడైన
నిస్స్వుఁడైనను స్వర్గనిత్యసుఖంబులఁ బడయఁగోరినయట్టి పడఁతి పతిని

తే. విడువఁగా రాదు; పతితుఁడై పుడమియందు
నిందఁబొందెడు భర్తను నీతిదూరుఁ
డగుట విడువంగఁ జనుఁగాని యట్లుగాని
పతిని విడువంగరాద దేయతివకైన. ౨౯ 1695

క. కులకాంతకు మగఁడున్నను, విలయం బందినను జారు వేఁడుకఁ గని యి
మ్ములవానిఁగూడు టెన్నఁగ, నిలసుఖకర మెప్పుగాదు హీనంబె యగుఁ. ౨౯౪

తే. యశముగల్గదు దాన నత్యంతదుఃఖ
మొదవు నంతియకాక యత్యుగ్రభయద
మగును సర్వస్థలముల నింద గలుగంగఁ
జేయుఁ గావునఁ గూడద దేయెడలను. ౨౬ 1697

క. వనజాక్షు! సర్వము నీవని నమ్మినవారమాట నమలభవత్పా
దనళినయుగముం గొల్చుచు, వనమున నిందుండు మనుచుఁ బలుకుదు రేమో?

మ. [2]నను దూరంబుననుండియే వినుచు నానానారీతులఁ బ్రీతిఁ గీ
ర్తనముల్ చేయుచు వేళలందుఁ గనుచుఁ ధ్యానించుచుఁ మానవుల్
గనఁగాఁ జాలుదు రెట్టిభావ మది నిక్కం బెన్న మత్సన్నిధిం
దనివారఁ నివసింపఁ గల్గదుసుఁడీ తన్వంగులారా! యిఁకన్. ౨౭ 1699

క. చనుఁడీ మీమీగృహముల,కని గోవిందుండు పలుకఁ గా నప్రియవా
ర్తను దాని వినుచు గోపిక,లనూనసంకల్ప మట్లు వ్యర్థంబైనన్. ౨౭౪ 1700

1 "దుశ్శీలోదుర్భగోవృద్ధో జడోరోగ్యధనోపివా, పతిస్స్త్రీభిర్నహాతవ్యో లోకేప్సుభిరపాతకీ" అని మూలము. 2 "శ్రవణాద్దర్శనాద్ధ్యానా న్మయి భావోనుకీర్తనాత్, నతథాసన్నికర్షేణ ప్రతియాత తతోగృహాన్" అని మూలము.

ఆ. కడు విషణ్ణ లగుచుఁ । గడవంగరానిచిం,తలను గుంది; రిట్టు । లలఘుదుఃఖ
భారమగ్న లగుచు।వరుస శీర్షంబుల,వంచి మిన్ను విఱిగి।పడినయట్లు. ౨౮ 1701

క. క్రమముగ నిట్టూర్పులయు,ష్ణము సోఁకున బింబఫలము । చందంబున నే
కమలిన బింబాధరములు, తమదుస్థ్సితిఁ దెలుప మోము।దమ్ములు వాడన్. ౨౮౪

క. చరణాంగుళులన్ వదలక, ధర వ్రాయుచు నంజనాక్త।తతనయనాశ్రు
త్కరపాతము కుచకుంకుమ, మురుగతిఁ దుడువంగ దుఃఖ । ముత్కటమగుటన్.

క. పలుకఁగ నేమియుఁదోఁపమి, నిలుచుండిరి; వారిమదుల । నిర్మలమగుచున్
జెలఁగెడు ననురాగము శ్రీ,జలజాక్షునియందె కానఁ । జక్కని స్వామిన్. ౨౯

సీ. శ్రీకృష్ణునే నమ్మి । చిత్తంబులంగల సర్వకామమ్ములఁ । జక్రికొఱకె
వదలియుండెడునట్టి।వారౌటఁ దమకున్న ప్రియవస్తువులయందుఁ।బ్రియతముఁడని
హరినె నమ్మినవార।లౌటఁ బ్రియేతరువలె నట్లుచక్కఁగాఁ । బలికినట్టి
సారసనేత్రుని । సర్వలోకేశ్వరుఁ గని యేడ్చి కన్నీటఁ । గ్రమ్మఁబడిన

తే. నయనముల నెట్లొ తుడిచికొ।నంగఁజాలి
కోప మొలయుటచేత డ।గ్గుత్తికఁదగు
పలుకులం బల్కి రిట్లని; । జలజనేత్ర!
సర్వలోకవిభుండవు । చక్రివీవ. ౩౦ 1705

క. క్రూరాత్ములు పలికెడు న,ట్లీరీతిం బల్కఁజనునె । యెల్లవిషయముల్
సారవిహీనములని విడి, చేరితి మిటు త్వత్పదసర।సిజమూలంబున్. ౩౦౪ 1706

మ. కనుకన్ భక్తిభరంబుచేఁ దమిని నిక్కం బేము సేవింపఁగాఁ
జనుదేరం గని మమ్ముఁ బొమ్మనుట యే।చందంబొ? స్వాతంత్ర్యముం
గను దట్లౌటను గావఁగా జనుఁగదే । కంజాక్ష! మోక్షార్థులౌ
జనులన్ భక్తుల నాదిపూరుషుఁడు వి।శ్వస్వామి లోఁగొన్నటుల్. ౩౧ 1707

క. మముఁ గావంగాఁజను నో, యమలాత్మా! దేవదేవ । యాదిపురుష! ధ
ర్మముల నెఱింగిన ప్రోడవు,గ మాకుఁ దెల్పితివి మెచ్చఁ।గా వచ్చునిలన్. ౩౧

మ. పతులన్ సూనుల బంధురాజి నయ మొ।ప్పన్ మన్ననం దన్పుచున్
జతనంబొప్పఁగ వారి గొల్చుటయె చం।చద్ధర్మమౌ నంగనా
తతి కంచున్ వరధర్మవేత్తవగుచున్ । దైవా రునీవే వచిం
చితికాదే యుపదేశకాలమున నే । చెల్లుంగదా నీయెడన్. ౩౧౪ 1709

క. ఉపదేశార్హుఁడవయి మఱి, యపరిమితస్వాత్మశక్తి । వయి యీశుఁడ వై
కృపకున్ నిధివగు నీయం,దె పరాత్మా! తగియెయుండు । నెంతయుఁ జూడన్.

సీ. తనుధారులకునెల్ల । దామోదరా! నీవె యత్యంతబంధువ । వగుచు నాత్మ
వయి ప్రియుండవునయి । యలరుని వుండఁగ నొరులను సేవించు । నుద్యమమది.

యేటికి? నిట్లుమేమే కాదు శాస్త్రనిష్ణాతలుకూడ నీశ్వరుఁడ వగుచు
నిత్యప్రియుండు నాఁ నెగడి యాత్మవునగు నీయందె భావంబుఁపాయకుండ
ఆ. నునుతు రార్తిదులయి యొప్పుపుత్త్రాదుల,యందు నునుప రంతమందు వార
లాత్మకును మహార్తి నమితముగా నొసం,గుదురుగాన వారిఁ గూర్మిఁ గనరు.
క. అరవిందాక్షా! పరమేశ్వర! మాయం దెల్ల సుప్రసన్నుఁడ వగుమీ
చిరకాలమునుండియు నీ, పరిసరమున నుండఁ గోర్కి పరఁగుటకతనన్. 33
క. మామదుల నంకురించిన, ప్రేమాకృతి గన్నయాశ భేదింపకుమా
కోమలలతవంటి దదా, గా మన్నన దానిఁ బెంపఁగాఁ జను నీకున్. 331713
క. ఇందాఁకఁ గృహభోగము, లందే దగియున్నయట్టి యాత్మల నీవే
క్రందుగ సుఖముగ దొంగిలి, యిందుంటివి పొమ్మటన్న నెట్లది పొసఁగున్.
*క. గృహకృత్యంబుల మరగిన,వి హస్తములు రెండు నీదు విపులతరమ్మా
మహిమంబున లోఁగొంటివి, విహగేశ్వరగమన! యవ్వి వెడలు నదట్లో. 334
చ. వనజదళాక్ష! నీదుపద వారిజమూలమునుండి పాదముల్
చనఁగఁ జలింపకుండెడు వ్రజంబునకుం జన నేర్తు మెట్లు? పో
యిన నటఁ జేయుకార్య మది యేదొ యెఱుంగఁగరాదు వేగపొం
డనినఁ జనంగ నోపుదుమె యం దొనరింపఁగ నున్న దేమియో? 3౮ 1716
సీ. తోడుపాటుం జూపి తొందఱ లేవియుఁ గలుగకుండఁగఁజేయు జలరుహాక్ష!
మందస్మితాలోక మహిమమ్మునఁ వేణుకలనినాదమ్మునఁ గలిగి రేఁగు
సంతాపహుతవహు వింతయూ నీయధరామృతపూరంబుచే మరలను
దలసూపకుండ నిమ్ముల నార్పుమా; యట్లు చేయకగృహములఁ జేరఁ డనుచు
తే. నానతిచ్చినఁ ద్వద్వియోగానలమునఁ
దనువు లివి దగ్ధములుకాఁగ ధ్యానయోగ
మునవె నీపాదసరసిజమూల మొందు
వార; మంతము నొందియుఁ జేరఁగలము. 3౫ 1717
క. తనువులు దృఢయోగానల,మున దగ్ధములగుడు యోగిమూర్ధన్యులు ని
న్నును జేరనట్లు చేరుదు, మనుమానము లేదు కృష్ణ యాత్మ నెఱుఁగుమా.
చ. వనజదళాయతాక్ష! వనవాసులకెల్లఁ బ్రియుండవైన నీ
ఘనతమపాదమూలము నికామమహోత్సవ మిచ్చుఁగా జగ
జ్జననికి లక్ష్మి కొక్కపుడె సర్వముహూర్తముల్ లభింప దా
వనితయు దానికే చెలఁగి వారక సంతస మందుచుండుఁగా. 3౫4 1719
క. ఆపాదతలము మేమో, యోపిక నొకపరి స్పృశించి యుగ్రాటవి ని

* "చిత్తం సుఖేన భవ తాపహృతం గృహేషు" అని మూలము.

న్నే పరమాదృతిఁ గాంచుచు, నీపరమకృపార్ద్రదృష్టి నెమ్మిఁ బొలయుటన్. ౩౬
క. సంతోషితచిత్తంబుల, నెంతయు ధన్యుల మటంచు నెసఁగుదుము విభూ!
యంతటనుండియు నితరుల, పొంత క్షణంబైన నిల్వఁ బూనముసుమ్మా. ౩౬
*క. ఇతరులు తుచ్ఛు లటంచున్, మతులం దోఁచెడిని; లోకమాన్యు లనెడువి
స్తృతకీర్తిఁగన్న యజముఖు, లతిముదమున నేపరాంబికాదృతికొఱకై. ౩౬౪
చ. అనవరతప్రయాసముల నందుదురో యలమంగళాంబయే
యనుపమ తావకీనహృదయాంబుజవాసముఁ గాంచఁ గల్గియున్
వినయధురీణులై వెలయు భృత్యులు గొల్వఁగ నొప్పునీదు ప
ద్వనజరజంబునుం దులసిఁ బాయకకూడియె పొందఁ గోరెడున్. ౩౭ 1723
క. మంగళదేవతవలె మేముం గమ్రపదాంబుజరజమ్ముం దమిమైఁ బొం
దం గోరువారమైతిమి, మంగళకర! తీవ్రదుఃఖమండలహరణా! ౩౭ 1724
సీ. త్వదుపాసనాశల వసతుల విడనాడి నిన్ను సేవింపఁగ నెమ్మిఁగనుచుఁ
బాదమూలంబుల పట్టుఁ జేరితి మట్టులౌటఁ బ్రసన్నుండ వగుము దేవ!
త్వన్మనోజ్ఞస్మిత తతనిరీక్షణతీవ్ర కామతప్తాత్మలఁ గాంతల మముఁ
బురుషభూషణ! దాస్యము గరుణించియె కాపాడుమా; భోగ్యకంబులయిన
తే. సద్మముల వీడి నాదుదాస్యంబు నేల, కోరితిరొ యందు వేమొకో కుండలముల
మండితములగు కమనీయగండభాగ,ములును సుధఁజిమ్ము బింబోష్ఠమును దగం
చ. దరహసితావలోకనయుతంబయి కోమలకుంతలంబులన్ [గ. ౩౮౪
నిరుపమమై ముదంబొసఁగు నీనునుమోమును సంశ్రితాళికా
తురతను బాపి యెల్లపుడు తోఁచుచు వే యభయంబొసంగు నీ
వరభుజదండమున్ సిరికి వాంఛ నొసంగఁగఁజాలువక్షమున్. ౩౯ 1726
చ. కనుఁగొని నీప్రభావము జగంబుల నిస్సమ మంచు నమ్మి నీ
కు నయితి మెంతయుం బొదలుకోరిక దాసుల; మోమహాత్మ! జా
రనిరతి నింద్యమా నను చు రమ్యతరోక్తులఁ బల్కితీవు చ
క్కనిదగు భావమే య దగుఁ గాని మఱొక్కటి యాలకింపవే. ౪౯ 1727
చ. కలపదయుక్తమూర్ఛనలఁ గమ్రతరంబగు వేణుగాన మి
మ్ములవిని ముజ్జగంబులఁ బ్రమోదము నించుచు సాటిలేకయే
యలరెడు నీదురూపము మహాదృతిఁ గాంచియు నీజగత్త్రయిం
గలజలజాక్షి యెవ్వతుకగాని భవచ్చరణాబ్జసేవకై. ౩౯౪ 1728
తే. భ్రాంతినొందుచు నార్యధర్మ మననొప్పు

* "స్థాతుం త్వయాభి రమితా బత పారయామః" అని మూలము. 'తుచ్ఛాస్తేనరోచంత ఇత్యర్థః' అని వ్యాఖ్య.

నిజసదాచారమున నిల్వ । నేర్చుఁ? గృష్ణ
వనిత లననేల? వరగాన।మును సురూప
మును వినియుఁ జూచియుఁ గోపు।లును ద్విజములు. ౪౦ 1729

క. తరువులు మృగములు పులకాం,కురముల వహియించుఁగాదె । కువలయనయనా
పురుషోత్తముఁ డావిష్ణువు, సురలోకముఁ గాచుపొంటె । శుభరూపమునన్.

క. అవతార మొందురీతిని, బ్రవిమలకృప వ్రజమునందు । వసియించు మముఁ
వివిధార్తులఁ దొలఁగించుచు, సవిధిగఁ గాపాడ నీవు।జన్మించితి సూ! ౪౦౫ 1731

క. ఋత మీయది యార్తజన,ప్రతతికి బంధువవు నీవు । పాదంబులనే
సతతముఁ గొల్చెడు దాసీ, తతికిం గలయార్తిఁ బాపఁ।దలఁచి మనమునన్. ౪౧

క. కలవిలపాటొందించు స,కలవాంఛలఁ గూడిహితము । గనలేని యుర
స్థ్సలముల శిరముల నీకర, జలజాతం బునుపు మూర్తి । చయ్యనఁ బాయున్.

క. గురు వుపదేశించెదున,త్తరుణంబున శిష్యుదౌ హృ।దయమునఁ దలపైఁ
గర మునిచి కాచుగతి నీ,కరసరసిజ మునుపవయ్య । కమలానాథా! ౪౧ 1734

క. అని భక్తిపారవశ్యం,బున గోపిక లాడినట్టి । పూజ్యహితోక్తుల్
విని యోగీశుల కీశుఁడు, జనులసదాత్మల వసించు।సత్తముఁ డజుఁడున్. ౪౧౫

క. వనజాక్షుఁడు నగుకృష్ణుఁడు, మనమున యోజించి నవ్వి । మాటల భావం
బును నెంచి యార్తిఁబాపం,గను బ్రీతహృదబ్జలనుగఁ । గ్రన్ననఁ జేసెన్. ౪౨

సీ. మందహాసంబులఁ । గుందకుట్మలదంత . కాంతులసమ్మోహ।కరవిచేష్టి
తములఁ గావించుచు । దామోదరుఁడు తనవదనాంబుజముఁ గాంచి।వరుస వికస
నము నొందుమోముల । నమరునాగోపిక లత్తఱిఁ దనుఁగూడి।యలరఁ దార
కలఁగూడి తగుసుధా।కరునిచందంబున వెలయు చుండెను; గోప।లలన లెల్లఁ

ఆ. దన్నుఁగూర్చి పాడఁ।దానుఁ బాడుచు యూథ,పతి స్వకీయకరిణి।వితతి నడుమ
నలరునట్లు సుంద।రుల యంతరంబున, నలరె నఱుత వైజ।యంతి గ్రాల. ౪౪

చ. వనమున కెంతొ వింత చెలు।వంబును గూర్చుచునుండి యంత నొ
య్యన యమునానదిం గనఁగ । నందఱఁగూడియె పోయి యయ్యెడం
గనకపుఁగాంతి వాలుకయుఁ । గన్పడఁగాఁ బులినంబు రమ్యమై
కనఁబడ నందునుండెఁ దర।గల్ మది కింపును గూర్చుచుండఁగన్. ౪౪౫ 1738

ఆ. అలలయందుఁ గదలు । కలువపూవులవాస,నలు తగంగ వీచు।లలితపవనుఁ
డంతరంగమునకు । హాయిని గూర్పంగ, నందు వారిఁగూడి । యాహరియును.

సీ. కరములు వారిమూఁ।పురములపైఁ బర్వఁ జేయుచుఁ గౌఁగిటఁ।జేర్చునట్టి
చందంబు గనఁబడ । సరసహస్తంబుల ముంగురుల్ దువ్వుచుఁ । బొంగిపొరలు
నుత్సాహమునమీఁటి । యూరువుల్ నీవులు వక్షోజములు సుఖ।వార్ధిఁదేలు

నట్లు స్పృశించుచు ౹ హాసముల్ తగఁబల్కుచును నఖక్షతములు ౹ గనఁబడంగఁ
ఆ. జేయుచును విలాస౹సిద్ధిఁ గూర్చుచుఁ గటాక్షముల నింపుగల్గు౹కరణిఁ జేయు
చును మనోహరమ్ము౹గను నవ్వుచున్ బ్రేమ, మతిశయమ్ముగా వి౹హారలీల. ౪౬
క. వారిజనయనలతోఁ దమి, వారిజనేత్రుండు తేలె; ౹ వారలు దానన్
ధారణిఁ దమరే వనితా,వారంబున ధన్యల మను౹భావము గనుచున్. ౪౬౫
క. హరి మహితాత్ముఁడు తమ్ముం, బరమాదృతిఁ గూడియుండఁ ౹ బట్టఁదగనిదా
గరువము నొందిరి; సౌంద,ర్యరమామానంబు దాన ౹ నమరు గరువమున్. ౪౨
చ. తనమది నెంచి వారి కవి ౹ తప్పక వే తొలఁగింపఁబూని యా
వనజదళాక్షుఁ డచ్చటనె ౹ వారలకుం గనరాకయుండె నా
వనితలచిత్తవృత్తి యెటు౹వంటిదొ యప్డు పరీక్షచేయఁగా
ననువగు నంచు నెంచుటనె ౹ యట్టు లదృశ్యతనొందె నోవిభూ! ౪౩ 1743



ము ప్ప ది య వ య ధ్యా య ము.

శ్రీకృష్ణుని గోపికలువెదకుట.

క. భగవంతుం డంతర్హితుఁ, డగుటయు గోపికలు కృష్ణు ౹ నటఁ గానక పెన్
వగ నంది యూథనాయకు,ని గనని కరిణులనుబోలి ౹ నెమ్మి తొలంగన్. ౧ 1744
తే. పరితపించిరి; భార్గవీ౹పతి మనోజ్ఞ
గతులు ననురాగభరితసు౹స్మితము విభ్ర
మేక్షితంబులు మనమున ౹ కింపుఁగూర్చు
భాషణము లెన్నొయాటలు ౹ పాటలు మఱి. ౧౫ 1745
క. పలు దెఱఁగులగు విలాసం,బును మనములఁ ద్రిప్పికొలుపఁ ౹ బూబోఁడులు మి
క్కిలి తన్మయత్వముం గని, జలజాక్షుని చేష్టితముల ౹ స్మరియించి తగన్. ౨
తే. అనుకరించుచు విహరించి ౹ రంత హరిని
బ్రియమునం గాంచఁగోరు నా౹వెలఁదిమిన్న
లపుడు తన్మయతం గని ౹ హరిగతిస్మి
తేక్షణాలాపముఖముల ౹ నెన్నికొనుచు. ౨౫ 1747
సీ. అనుసరింపం బూని ౹ రత్తఱి వారికి నాహరిమూర్తి హృ౹దంతరములఁ
బ్రతిరూఢమైయుంట ౹ నతని చేష్టితములఁ దమ రొనర్చుచు నేనె ౹ తలిరుబోఁడి
కృష్ణుఁడ నని నేనె ౹ కృష్ణుఁడ నని తెల్పుకొనసాగి; రంత నా౹వనితలెల్ల
గుంపుగా నొక్కటఁ౹గూడి శ్రీకృష్ణుని చరితముల్ పాడుచు ౹ సాంద్రముదము
తే. నను వనమునుండి వేఱొక౹వనమునకును
జనుచు నున్మత్తులనుబోలి ౹ సంచరించు

చును బరాత్పరు వెదకిరి § కనుఁగొనుకుతు
కము చెలంగఁగ హరియు నె§క్కడఁ గలఁడని. ౩౪ 1748

క. భూతవ్రాతములం ద, బ్జాతాయతనేత్రుఁ డాన§ భముచందమునన్
జేతస్సుల వెలుపలఁ దగి, యేతీరున వెలుచేయ§నే గాకుండన్. ౩౪ 1749

ఆ. పరమపురుషుఁ డనఁగఁ § బరమేశ్వరుఁ డనంగ
నుండు నద్ది తెలియ § కుద్యమమున
భూరుహములకడకుఁ § బోయి శ్రీకృష్ణునిఁ
గంటిరే యదెందుఁ § గలఁడొ చెపుఁడ. ౮ 1750

క. అని యడిగి యంత నిలువక, చని యశ్వత్థంబ కృష్ణు§చంద మెఱుఁగుదే?
వనజాక్షుఁ గంటె ప్లక్షా, వనిరుహమావటమహీజ§వరమా? యనుచున్. ౮ 1751

క. మామనముల నందాత్మజుఁ, డామోదస్మితనిరీక్ష§ణాదుల నెట్లో
సామమున దొంగిలించెను, శ్రీమాన్యుని గాంచియున్నఁ § జెప్పరె మాకున్. ౫

సీ. ఓకురవకమహీ§జోత్తమా! నాగమా! పున్నాగచంపక§భూరుహంబు
లార!, యశోకమా! § సారసనేత్రుఁడు బలభద్రునను జుఁడు § సులలితాత్మ
సుస్మితమ్మునఁ § దన శుభకరపదపద్మములఁ గొల్చు మానవ§తుల మదంబు
హరియించి యిచ్చోటి § కరుదెంచెనా? మీరు కంటిరా? గోవింద§క్రమచరణ

తే. ములను బ్రీతివహించెడు § తులసి నీవె
కాదె కల్యాణి వెల్లలో§కంబులందు
నళులతో నిన్ను భరియించు § నచ్యుతుఁ బ్రియుఁ
గంటివే యిందు నెందైనఁ§గాని యిపుడు? ౭ 1753

వ. మాలతీ! మా శ్రీకృష్ణుండు మీకుదర్శనమిచ్చెనా? మల్లికా! జాతీలతారాజమా! యూథికా! తనకరస్పర్శమున మీకుఁ బ్రీతిఁగావించుమాధవుఁ డీమార్గమునఁ బోయెనా? ఓచూతవృక్షమా! ప్రియాళుపనసాసనకోవిదారజంబీరబిల్వవకుళ కదంబాది మహీరుహములారా! యమునాతీరమునఁ బరార్థము జన్మము నొంది యలరారుచున్న యోవృక్షములారా! శ్రీకృష్ణునిం గనుంగొనఁజాలక యుమ్మలించు చిత్తములుఁగల మాకు నాతనియున్న తావు తెల్పుఁడీ యని మఱియును.

చ. ధరణిరో! నీవ దెట్లు సుకృ§తంపుఫలం బగుస త్తపంబు నే
వరుస నొనర్చినావొ భగ§వంతునిపాదసరోరుహంబు సోఁ
క రహిదనర్చు నుత్సవము § గల్గుటచేఁ బొడసూపు నాతృణాం
కురపులకాళిఁ బొల్చెదవు § కోమలి నీదగుభాగ్య మెట్టిదో. ౯౪ 1755

క. అది యొదవుట మాకృష్ణుని, పదసంస్పర్శమునఁ జక్కఁ§ బ్రభవిల్లినదో
యదిగాదేని త్రివిక్రము, పదకంజాక్రమణకాల§భవమో చెపుమా! ౧౦ 1756

క. మునుపు వరాహాకృతి గను, వనజాక్షాశ్లేషసమయఽభవమో తెలియం
గనురాదు నీవె చెప్పుము, ఘనుఁడగు మాకృష్ణుజాడఁ ఽ గడు వడిమీఱన్.

క. హరిణీ! మృదులావయవా, త్కారమున నీనేత్రములకు ఽ గాఢానందం
బరుదుగఁ గల్గించెడు శ్రీ, హరి దయితాయుతిని నిచటఽకరుదెంచెనొకో! ౧౦

చ. తరుణిని గౌఁగిలించుతఱిఁ ఽ దత్కుచకుంకుమపంకముల్ మనో
హరవరకుందమాలికల ఽ నంటఁగ నొప్పుపరీమళంబు ని
త్తరుణమునందు నెల్లెడలఁ ఽ దార్కొనుచున్నది గాన గోకులే
శ్వరుఁ డొకవామనేత్రయును ఽ వచ్చియె యుందురు వారిఁ జూపుమా. ౧౧

సీ. ఫలభారమున వంగి ఽ భాసిల్లుతరులార! రామానుజన్ముండు ఽ వామకరము
దయితాంసమున నుంచి ఽ దక్షిణహస్తంబునందుఁ బ్రఫుల్లారఽవింద మూని
తులసిపూవులపయి ఽ నొలసిన మదభరాంధములగు మధుకరఽసముదయములు
తనవెంట నడువంగఁ ఽ దగుభక్తి నొనరించుమీప్రణామంబుల ఽ మేటివయిన

తే. ప్రణయదృష్టుల మన్నించి ఽ పరిఢవిల్లె
నే యెఱింగింపఁ దగు; నన ఽ హెచ్చుప్రీతి
నొక్కకొందఱు చెలులార! ఽ యిక్కడఁ గనుఁ
గొనరె యతిచిత్ర మిది చూడఁఽగను వినంగ. ౧౨ 1760

చ. లత లివె యాత్మనాథుఁడు విఽలాసనిధానమునైన యావన
స్పతివగుబాహుశాఖలను ఽ జక్కఁగఁ గౌఁగిటఁ జేర్చునట్లు స
మ్మతిని బెనంగియుండియును ఽ మాధవుసాధునఖాళిసంగతిఁ
ధృతపులకాంకురంబులయి ఽ యే కన నయ్యెడి నిక్క మద్దిరా! ౧౩ 1761

క. వీనిం బ్రశ్నించిన నా, సూనాస్త్రునితంద్రియుండు ఽ చొప్పు తెలియ నం
చూనినశ్రద్ధను దరుణులు, మానస మున్మత్తతఁగనుఽమాడ్కిఁ బలుకుచున్.

క. హరి నన్వేషించుచుఁ ద, త్పరతం గని విహ్వాలలయి ఽ తన్మయలగుచున్
సరసిజనయనుని తత్త్వద్వరలీలల ననుకరించి ఽ వనిఁ దిరిగి రొగిన్. ౧౪ 1763

సీ. ఒకతుక పూతనఽయొప్పున మెలఁగ నొక్కతె మాధవునిరీతి ఽ గాఁ గడంగి
చనుపాలు త్రాగెను ఽ జాన యొక్కతె శిశువట్లుగా నేడ్చుఁచుఽనంగనమఱి [నొక్క
యొక్కతె శకటాసురఽరోగ్రకాయముఁ బూనఁ గాలఁదన్నె; నదొక్కఽకాంతపూ
నాతృణావర్తునిఽయాకృతి నటియించి బాలుఁడా కృష్ణునిఽవలెఁ జెలంగు

తే. నంగనామణి యొకతుక ఽ నపహరించి
యెటకొ కొనిపోయె; మఱియొక్క ఽ యింతిమిన్న
చారుమంజీరమృదులనిఽస్వనము లొప్పఁ
గరములను జానువులఁ గృష్ణుఽగతిఁ జరించె. ౧౫ 1764

చ. ఇరువురు కన్యకామణులు । కృష్ణుఁ దదగ్రజుఁబోలియుండ సుం
దరు లొకకొంద ఱత్తఱిని । బాల్చిరి గోపకదేహముల్; తదం
తరమున వత్సదానవువి।ధంబున నున్ననొకర్తుకన్ ద్వరన్
హరివలెనున్న వేఱొకతె । యార్చుచు గూలఁగఁద్రోచె నేర్పునన్. ౧౬ 1765

తే. కృష్ణువలెనున్న యొక్కతె । యింతిమిన్న
యొర్తు బకుఁ డనుదనుజుని । యొప్పుగులుక
దానిఁబట్టి వధించువి।ధంబు గానఁ
బడఁగఁజేసెను హరియందు । భక్తి వెలయ. ౧౬ 1766

క. తరుణియొకర్తుక కృష్ణుని, కరణిన్ దూరగతగోని।కాయముఁ బిల్చెన్
హరివలె నొకతుక చక్కఁగ, మురళిన్ వాయింపఁ దక్కు।పొలఁతుక లెల్లన్.

క. గోవులవలె నటియించుచు, నీవేణురవంబు వినఁగ । హితమా ననుచున్
వేవే నుతియించిరి తమ, భావము లాకృష్ణునందె । వసియించుటచేన్. ౧౭

చ. ఒకతుక తానె కృష్ణుఁడని । యుల్లమునందుఁ దలంచుకొంచు వే
ఱొకతుక మూఁపురంబుపయి । నొయ్యన బాహువువైచి ముందుఁబో
వు కడఁకమైఁ బదాబ్జముల । భూసతిమెచ్చఁగఁ బుట్టుచున్ గనుం
డు కమలనేత్రలార! నను । నూతనకృష్ణుని గా నెఱుంగుఁడీ! ౧౮ 1769

చ. లలితమదీయసాధుగతు।లం బరికింపుఁ డటంచుఁ బల్కె; గో
పలలనయొర్తు కృష్ణుఁడను । బర్వెడువానకు గాలికిన్ భయం
బొలయక యుండఁజేసితి మ।హోద్యమ మొప్పఁగ నింక మీరు భీ
తిలక చెలంగుఁడీ! యనియె । ధీగతి తన్మయతం జెలంగఁగన్. ౧౯ 1770

క. అనిమఱియు నొక్కచేతను, దనచేలాంచలము *హరిప।దంబున వెలయం
గను బట్టుకొనియె; వేఱొక, వనితామణి కాళియాహి।వపు వలరంగన్. ౨౦

సీ. నిలుచుండ వేఱొక।నెలఁత కృష్ణుండయి దానిశీర్షమునఁ బ।దంబుఁబెట్టి
యోదుష్టసర్పమా । యురుగతి నిటనుండి తరలిపొమ్మా నేను । దండధరుఁడ
నై దుష్టులం జెండ । నవతరించితి ననె; మఱియొక్కగోపిక । మహిమమొప్ప
గోపకులార! మీ।కుత్కటమైన దావాగ్ని మిముఁగ్రమ్మ వచ్చెడు । మీరు కనులు

తే. మూసికొనియుండుఁడీ యగ్ని । గాసిపెట్ట
కుండ క్షేమంబు గల్గఁజే।యుదు నటంచుఁ
బలికె; వేఱొకపద్మాక్షి । పంకజాక్షు
నాకృతిం దన్నుఁదలపోయు । నంగనఁ గని. ౨౨ 1772

ఉ. చోరునిరీతి వెన్నఁదిను।చో దధిభాండము ప్రక్కలించితే

* హరిపదము = ఆకాశము.

యోరి యటంచుఁ బుష్పముల । నొప్పుగఁగూర్చినదండఁ గట్టుచుఁ
జోరనిభంగి ఆోట నిదె । చూడుము కట్టిద నంచుఁబల్క నా
సారసనేత్ర భీతి గను।చాడ్పున మోమును మూసికొం చొగిన్. ౨౨ 1773

క. కనఁబఱచె నాఁటికృష్ణుచ, దనచిహ్నము; నిట్లు గోప।తరుణులు బృందా
వనమునఁ గలలతలను భూ,జనికాయము వాసుదేవు।జాడ నడుగుచున్. ౨౩

చ. అరుగుచునుండ నావనము।నం దొకభాగమునందు రాధికే
శ్వరుని మనోజ్ఞపాదముల।జాడలు కన్పడియెన్; ముదంబునం
దరుణులు నిల్చి యందు నివి।తప్పక నందునికుద్దుపట్టి వా
చరణములే సరోజము ధ్వ।జంబు యవాంకుశవజ్రముల్ తగన్. ౨౪ 1775

క. కనఁబడియెడు చిహ్నంబులు, గను బాదములిడినచోటఁ । గనుఁగొనుఁడీ; యం
చును జెప్పుకొనుచు నబలలు, చనఁజొచ్చిరి పదము లిడిన।జాడనె త్వరగన్.

చ. అరయుచు వాసుదేవుఁ డెటు । లావని నేగెనొ యంచుఁ బోవుచో
ధర నొకచోటఁ గృష్ణుని ప।దంబులతో నొకగోపసుందరీ
చరణము లట్టి కానఁబడ । సాంద్రతరార్తిని బొంది వార లి
క్కరణిని బల్కఁజొచ్చి రిదె; । కన్గొనుఁడీ సఖులార! వేగమే. ౨౬ 1777

సీ. నందనందను పావ।నముగుమూఁపురముపై బాహులతం జేర్చి । పడఁతియొర్తు
మదకరితోడ స।మ్మదమునఁ బోయెడుకరిణివలెన్ బోవఁ । గల్గినయది
యమ్మచ్చెకంటివా । నడుగు లీయవె దానిసౌభాగ్య మెం తనఁ।జనునొ; పూర్వ
జని భగవంతుఁ డీ।శ్వరుఁడు శ్రీహరి దీనిచేతఁ బూజితుఁడయ్యె । సిద్ధమిద్ది

తే. కనుకనే దానిఁ బ్రీతిమైఁ । గలిసి చనియె
మనల దిగనాడి యేకాంత।మార్గమందు
దాని మనసును మెప్పింపఁ।దలఁచి యోర!
చెప్పఁ దరమౌనె యాయింతి।యొప్పు మనకు. ౨౭ 1778

*క. చెలులార! కృష్ణుపాదక,మలరేణుకణంబు లెంత । మహనీయములో?
జలజాసనుఁ డీశుఁడు సిరి, తలలన్ ధరియింత్రు పాప।తతి తొలఁగుటకై. ౨౮

క. వారింబోలుచు మన మీ, సారసదళనేత్రు పాద।జలరుహరేణు
స్ఫారకణంబులఁ దాల్చిన, నారీతిం గృష్ణుఁబడయ । నను వగుఁగాదే. 1780

మ. వనజాక్షుం గొనిపోయినట్టి దగునా।వామాక్షి పాదాంకముల్
మనచిత్తంబుల క్షోభముం గనఁగ ని।మ్మాడ్కిం బొనర్చెంగదే
మనసామ్మై తగునచ్యుతాధరసుధన్ । మర్యాదపోఁ దట్టి తా
నె నితాంతంబు రహస్థలంబునను సం।తృప్తిం దమిం ద్రావెడిన్. ౩౦ 1781

* "యాన్ బ్రహ్మేశోరమాదేవీ దధు ర్మూర్ధ్న్యఘనుత్తయే" అని మూలము.

ఉ. ఏలొకొ యీతృణాంకురము ♦ లెంతయు దట్టముగాఁ జెలంగు ని
చ్చోఁ లలితాంగిపాదములఁ◆చొప్పు కనంబడకున్న దద్దిరా!
శ్రీలలితుండు ప్రేయసిని ♦ సిద్ధము కోమలపాద యంచుఁ గ
ష్టాలికి నోర్వఁజాల దని ♦ యంసమునన్ దమిఁ జేర్చియే చనెన్. ౩౧ 1782

చ. కనుకనె కృష్ణమూర్తి పద◆కంజములే యిటఁ గాననయ్యెడున్;
[వనరుహనేత్ర నెత్తుకొని ♦ వారిజనాభుఁడు పోవుచో భరం
బునఁ దనయంఘ్రు లుర్వి దిగఁ ♦ బూనిక నేగినచిహ్నముల్ కనం
గనఁ గనుపట్టుచున్నయవి ♦ కంటిరె గోపికలార! వేడుకన్. ౩౧ 1783

ఉ. కాముకుఁడౌటఁ బ్రేయసిని ♦ గంజదళాక్షుఁ డలంకరింపఁగా
నీమహిఁ బుష్పముల్ చిదుమ ♦ నెట్టులొ దింపియె యుండ నోపు] నో
భామినులార! కావుననె ♦ పాదములందలి యగ్రభాగముల్
భూమిని నొక్కియున్నవిధ◆ముల్ గనుపట్టెడుఁ జూడుఁ డిందులన్. ౩౨ 1784

క. హరి తాఁ గోసినప్రసవో,త్కరముం బ్రియురాలి మస్తకంబున ముడువన్
బరమాదరణంబున నీ, ధరణిం గూర్చుండియుండుఁ ♦ దథ్యం బిదియా. ౩౩ 1785

సీ. అని పెక్కుభంగుల ♦ హరిచర్యలన్ జెప్పుకొనుచు దైన్యంబున ♦ వనమునందుఁ
దిరుగుచుండిరి స్వబుద్ధిస్ఫూర్తి మాయంగ; నాత్మసంతుష్టుఁడై ♦ యాత్మయందె
విహరించువాఁడయి ♦ వెలఁదిమిన్నల విభ్రమములకు నవశుఁడై◆యమరియుండ
నేర్చినవాఁడయ్యు ♦ నీరజనేత్రుండు కామాతురుల వగు◆కష్టవితతు

ఆ. లిట్టులుండు ననుచు ♦ నెల్లరకుం దెల్పఁ, దలఁచి కాముకులకుఁ ♦ దరుణు లెట్టి
దుర్జనతను జూపి ♦ తొందఱ కల్గింతు,రనియు నెఱుకచేయ ♦ నాత్మఁ దలఁచి. ౩౪

క. ఏగోపికఁ గొనిపోయెనొ, యాగోపికతోడ వనవి◆హారము సల్పెన్;
భోగాసక్తిన్ హరి తను, బాగొప్పఁగఁ గూడె ననుచుఁ ♦ బటుగర్వమునన్. ౩౫

క. తలపోసి యానితంబిని, జలజాక్షులయందు నెల్ల ♦ సర్వవిధములన్
దలపోయ మిన్న నని ని,స్తులమదముం గాంచి కడఁక◆తో హరితోడన్. ౩౬

ఆ. కొంతదూర మరిగి ♦ యింతంతయనరాని, మదము తన్ను గ్రమ్మ ♦ మంజువాణి
యింకనొక్క యడుగు ♦ నిడఁజాల నీమది, నరుగఁ దలఁచి యున్న◆యచటికి నను.

క. కొనిపొమ్మా యన మధుసూ,దనుఁ డాయుగ్మలిని గాంచి ♦ తరుణీ! నామూఁ
పునఁ గూరుచుండు మన న,వ్వనితయు నటు చేయఁ బూను◆వాంఛం గొనఁగన్.

క. తనమహిమ మ్మగపడఁగా, వనజాక్షుఁ డదృశ్యుఁడయ్యె ♦ వనితయుఁ దాపం
బునఁ బొగులుచు నోరమణా, ఘనబాహూ! ప్రాణనాథ! ♦ కంజాక్ష! హరీ. ౩౮

క. లోకంబున మాకధికులు, నీకంటెం గలరె యెందు ♦ నీ వున్నావో
శ్రీకృష్ణా! కృపణను గద, నాకు న్నీదాసికిన్ మహనం బలరంగన్. ౩౯ 1792

క. నీసన్నిధిఁ గృపసేయుమ, యోసరసిజనేత్ర! యనుచు ¸ నొగిఁ బలవించెన్
గాసిలె దాన; దక్కిన, యాసారసనేత్ర లెల్ల ¸ హరిని వెదకుచున్. ౩౯ 1793

తే. ప్రియుని విశ్లేషమునఁగల్గు ¸ భీతియు వగ
పెల్లునుం దన్ను నేఁచంగఁ ¸ దల్లడిల్లు
నన్నుమిన్నను గాంచి; రా ¸ యతివ కృష్ణు
వలనఁ గలిగిన మన్ననఁ ¸ దెలియఁ బలికి. ౪౦ 1794

క. తనదగు దౌర్జన్యంబున, వనజాక్షుని మూలముననె ¸ వచ్చి యనూనా
ర్తిని గలుగఁజేయు నవమతి, వినిపించిన వారు మిగుల ¸ విస్మయ మడరన్. ౪౧

సీ. ఆతన్వియుం దోడ ¸ నరుగుదేరఁగ నవ్వనమునందు శ్రీకృష్ణు ¸ మమతమీఱ
వెన్నెలగాయంగ ¸ వెదకి రవ్వల గహనాంతరంబునను సాంద్రాంధకార
మావరింపఁగ నింక ¸ నరసినఁ గన్పడఁ డనియంత మరలి; ర ¸ ట్లంధకార
మొలసియున్నను బురుషోత్తమునందె చిత్తములు పర్వఁగ నొండుతలంపులుడిగి

తే. యతని సల్లాపములె పల్కు ¸ చతనిచేష్ట
లే నటించుచుఁ దద్గుణ ¸ బృందములనె
పాడుచున్ దన్మయతనొంది ¸ పడఁతు లప్డు
తలఁప రాత్మగృహాళి సుంతయును మదులఁ. ౪౩ 1796

చ. వనముననుండి వచ్చి యలవారిజనేత్రలు మున్ను ప్రీతి నా
వనరుహనేత్రుతోఁ గలిసి ¸ భవ్యగతుల్ దగనున్నయానదీ
ఘనపులినంబుఁ జేరి యటఁ ¸ గాంచనచేలుని నాత్మలందుఁ జ
క్కనియనురాగ ముప్పతిలఁ ¸ గాఁ దలపోయుచుఁ జూడఁగోరుచున్. ౪౪ 1797

తే. ఎపుడు చనుదెంచునో హరి ¸ నెపుడు ప్రీతి
వర్ధిలం జూతుమో యెప్డు ¸ వనరుహాక్షుఁ
గూడి యిం దుందుమో యను ¸ కోర్కి వార
లందె యుండిరి మనసు లా ¸ హరిని జేర. ౪౫ 1798

ముప్పదియొకటవయధ్యాయము.

గోపికాగీతలు.

క. చెలికాఁడ నీవుపుట్టుట, వలనన్ గోకులము మిగుల ¸ వర్ధిల్లెడు శ్రీ
లలనయు నిం దనవరతము, విలసిల్లు ముదంబుమీఱ ¸ వేడుకలలరన్. ౧ 1799

చ. కరుణకు నీవె స్థానముగఁ ¸ గ్రాలుదు వట్లగుటన్ ద్వదీయప
త్సరసిజయుగ్మమందుఁ దమి ¸ స్వాంతములెల్లను జేర్చి నిన్ను నే

నిరతినినమ్మి ప్రాణముల నిల్పుచు నెట్టులొ కాంచుకోర్కిచేఁ
దిరుగుచునున్న మాకు నిఁకఁ దెప్పున దర్శన మిమ్ము శ్రీహరీ! ౧ 1800

సీ. నీయందుఁ జక్కని నెమ్మి గల్గినవారి కరయ దక్కుగుదు వో వరద! మేము
నీవు కోరకయున్న నీయందుఁగలభక్తి దాసికల మగుచు దర్శనార్థ
మిందుఁ జరించు నీసుందరులను శరత్కాలనిర్మలతర కమలసాంద్ర
సరసులఁ జక్కఁగా జన్మించి యలరుతామరల యంతర్భాగసురుచిరరుచిఁ

తే. *దెగడు నీచూడ్కుల నిటు వేధించుచున్న
వాఁడవే యిద్ది చూడఁగ వధము కాదొ
శస్త్రవధమె వధంబనఁ జను సనెదవొ
యిపుడు నీచూడ్కియే వధియింపఁ జాలు. ౨ 1801

చ. పురుషవరేణ్య! కాళియుని భూరివిషానలతప్తవారిచే
మరణము గల్గకుండ మము మాధవ! కాచితి; సర్పమానఘూ
శరవరునుండి, ఘోరతరసర్వజనాంతకవృష్టినుండి భీ
కరపవనంబునుండి పవిగాఢధనంజయునుండి కాచితొ. ౨౪ 1802

క. పంచత్వముఁ గల్గింపఁగ, నెంచిన వృషభాఖ్యునుండి కృష్ణా! క్రుధచే
మించిన వ్యోముని నుండియు, నించుకయు విపత్తు గల్గనీకయె మమ్మున్. ౨౪

తే. మఱియు నెన్నియొ విధముల మరణము లొగిఁ
గల్గనుండఁగ వానిని గరుణఁ దోలఁగఁ
ద్రోచి కాపాడితివి పెక్కురూపములను
గలిగె నాపదలన్నియుఁ దలఁగెఁ గాదె. ౩ 1804

మ. చెలికాఁడా! విను గోపికామణియనం జెన్నొందుచున్ నందుని
స్తులభాగ్యంబగు నాయశోదనును బుత్త్రుం డంచు నిన్నే మొగిం
దలఁపంజాలము; సర్వభూతముల యంతస్సాక్షివై పొల్చుని
శ్చలతత్త్వం బవు, మాయగైకొనియె యీ చందంబునం బుట్టితొ. ౪ 1805

చ. సరసిజసూతి వేఁడఁగనె సర్వజగత్పరిరక్షణార్థ మి
ద్ధర యదువంశమందు నవతారముఁ గాంచితి; వట్టినీవు దు
స్తరభవభీతి నీచరణసారసయుగ్మము నాశ్రయింపఁగా
నిరతము గోరువారలకు నీకరపద్మమె నెమ్మిమీఱఁగన్. ౪౪ 1806

క. అనిశ మ్మభయప్రదమా, మనమునఁగల వాంఛితముల మానక యిచ్చున్
వనజాలయాకరాంబుజ,మును గైకొని మించు; దాని మురహర! దయచేన్.

*"వరదనిఘ్నతో సేవా కింవధః" అని మూలము. "శస్త్రైరేవవధోవధః, కింవృశావధోవధోనభవతి కింతు భవత్యేవ" అని వ్యాఖ్య.

ఆ. వృష్ణివంశధుర్య । వేగ మాశిరముల, యందు నునుపవయ్య । యాశ్రితవ్ర
జజనబాధ లడఁపఁజాలు వాఁడవునీవు, వీరశేఖరుఁడవు । సారసాక్ష. ౨ 1808

క. తను నాశ్రయింపఁబూనిన, జనుల మదం బెల్ల నడఁపఁ । జాలు స్మితముచే
తను బొల్చువాఁడవు హరి!, గనుకనె నీసేవ చేయఁ । గా నెంచు మమున్. ౩

క. చెలికాఁడ ! కైకొనంగదె, తొలుదొలుతన్ మంజువదన । తోయరుహము ని
స్తులకృపఁ గనఁబఱుపుము; భ, క్తులపాపము లడఁచు నీదు । కోమలపదముల్. ౪

చ. కనుఁగొన గోగణంబు వెను । కం జనుచున్ సిరి కాటపట్టనం
జని మదశాలి కాళియుని । చారుశిరస్థితిపైఁ జెలంగి దే
వనికరసేవితం బగుచు । భాసిలు నీపదపంకజంబు నొ
య్యన దయ నస్మదీయహృద । యస్థలులన్ నిలుపంగదే విభూ! ౫ 1811

క. తొలఁగింపు మనోవాంఛల, జలజాక్షా! బుధజనులకుఁ । జారుతరము మం
జుల వాగ్యుతమునునయి సొంపులుగుల్కెడు నీదువాక్య । పుంజము వినఁగన్.

చ. మనములఁ జాలనాశఁగొని । మాధవ ! వచ్చితి మేము నీదునా
జ్ఞను జవదాఁటకుండఁ గడు । శ్రద్ధను జేసెడువారమౌటఁ జ
క్కనియధరామృతం బొసఁగి । కావుము వీరవరేణ్యా ! వాక్సుధం
గొని బ్రదుకంగఁ జాలుదుము । గోపకులోద్ధరణా ! మహాప్రభూ! ౭ 1813

సీ. తాపత్రయంబునఁ । దప్తులౌ వారికిఁ ద్వత్కథామృతము జీ । వనము సుమ్ము
సుధకంటె నయ్యది । శుభతమంబై యొప్పు బ్రహ్మవేత్తలచేత । వర్ణితంబుఁ
బాపహరంబు శ్ర । వణమంగళంబును శాంతిదంబును నయి । సంశ్రయార్హ
మునయి చెలంగు ని । ష్పోలిక నొప్పెడు నీకథామృతమును । నెమ్మి నెవ్వ

తే. రర్థయుక్తిఁ గీర్తింతురో । యట్టివారు
పూర్వజన్మంబునన్ భక్తి । పూర్వకముగ
దానముల నెన్నిటినొ చేసి । మాననీయు
లగుచుఁ బుణ్యాత్ములునయి । యలరువారు. ౮ 1814

చ. *తనియుఁడు నాకథామృతముఁ । ద్రావి యిఁకేల మదీయదర్శనం
బనకుము మామనఃప్రియుఁడ । వై తెలియం దగనట్టివర్తనం
బునఁ దగువాఁడవౌదుకద । పుష్కరలోచన ! ప్రేమవీక్షణం
బును మది ధ్యానయోగమును । బూన శుభంబగునీవిహారమున్. ౯ 1815

క. చిత్తంబున నిల్చెడు నట్లుత్తమగతి నొనరఁజేయు । చుండెడు వన్నెల్
పొత్తును గూర్చెడు నర్మము, లిత్తఱి మామదుల నెల్ల । నేఁచెడుఁగృష్ణా! ౧౦

*"తర్హి మత్కథాశ్రవణేనైవ సర్వకృతార్థాభవతకింమద్దర్శనేనేతిచేన్న" అనుదానిభావమే యిందుఁ గలదు.

మ. కమనీయాకృతిమీఱ నాథ! పశుసంఘాతంబువెంటన్ మనో
జ్ఞముగా నీవలమందనుండి చనుచో § సంఫుల్లపద్మంబునం
దము నిందించెడు నీపదంబు లల కేదారంబులం బొల్చుస
స్యముఖంబుల్ తృణసంచయాంకురములన్ § జాలన్ స్పృశింపం గటా! ౧౦౯

ఉ. ఎంతగ నొచ్చునో యనుచు § నేము మనంబుల వంతనొంది యా
వంతయు హాయిలేక నిను § నారయుచుందుము సుమ్ము; నీవు ని
శ్చింతముగన్ వనిం దిరిగి § చిత్రమయూఖుఁడు గ్రుంకుచుండఁగాఁ
గుంతలముల్ వినీలరుచిఁ § గోరి కనందగి చెల్వుమీఱఁగన్. ౧౧

ఉ. ఆనన మట్టి ధేనువులయంఘ్రిరజంబున బ్రుంగి పుష్పాదుల్
జానుగఁ గ్రమ్మ భృంగములసంగతి నొప్పుసరోరుహంబు నాఁ
గానఁబడంగ మా మది లఖండముదంబును బొందునట్టు లిం
పైనగతుల్ చెలంగునటు § లల్లన వత్తువు నల్లనయ్యరో. ౧౧౯. 1819

క. పలుమాఱు మోముఁ జూపుచుఁ, గొలుపుదు వామోద మట్టి § గోపాల! మహా
ధులఁదోల సమర్థుఁడ వో,జలజాయతపత్రనేత్ర § స్వాంతప్రియదా! ౧౨ 1820

చ. కొలిచిన శర్మదం బగుచుఁ § ఘోరమహాపదలందు నెంతయుం
దలఁపఁగ నర్హమై క్షితికిఁ § దద్దయు భూషణమై చెలంగుచున్
జలరుహసూతి పూజలను § జక్కఁగఁ జేయఁగనొప్పి మ్రొక్కిన
య్యలకు నభీష్టరాజి నిదనర్హమునై తగునీపదాబ్జమున్. ౧౩ 1821

తే. మాయురస్స్థలు లందుంచి § మామకహృద
యార్తిఁ దొలఁగింపుమా; వీర! § యమలనాద
ముఖరవేణువుచేఁ జక్క § ముద్దిడఁ బడి
నట్టిదగు నీయధరసుధ § యలరుఁ గాదె. ౧౩౯ 1822

సీ. చక్రవర్తిత్వాదిజనితసుఖంబులయం దున్నప్రీతిని § నట్టె మఱచు
నట్లొరించుచు § నతిశయశోకనాశనచణంబయి తగి § ఘనతరమగు
నాసక్తిఁ బుట్టించునదియయి తనరు నీయధరామృతంబు మా § కాదరమున
నొసఁగుమా; పగలు నీవొప్పుగ వనమున కరుగునప్పుడు వ్రజమందు నున్న

తే. వారు నినుఁజూడఁజాలమి § వనటఁ గుంది
క్షణము యుగమట్లు గడపుచుఁ § గ్రమ్మఱ నది
యెట్టులో యస్తమయ మప్పు § డీవు మరలి
రాఁ గుటిలకుంతలంబయి § రమ్యమగుచు. ౧౪౯ 1823

క. సిరులన్ వెలయుచుఁ దగుసుం,దరతావకముఖము వారలతమిఁ గనుఁగొను న
త్తరుణమునఁ బక్ష్మములు నం,తరాయముం గూర్ప దానఁ § దహాతహపడుచున్.

క. ఇది యేమని చింతింతురు, కొదువపడకయుండఁ జూడఁగోరిన నడ్డం
బొదవించు పక్ష్మముల ని,ట్లదయతఁ బుట్టించిన విధి ౹ యతిజడుఁ డగుఁగా. ౧౪

క. చ్యుతిలేనివాఁడ వనియే, పతులం బుత్త్రులను వారిబంధువులను భ్రా
తృతతులఁ! దక్కినవారల, నతిక్రమించియె యెసంగునట్టి ప్రియమునన్. ౧౫

చ. మనమున కెంతొ హాయి తగుమాడ్కిఁ జెలంగెడు నీదుగానముల్
విని యతిమోహమందుటను ౹ వేగమ నీగతి యెంచి ధూర్తుఁడా!
కనుఁగొనవచ్చినార మిది ౹ కాదుకదా పగ లిట్టిరాత్రి నే
జనుఁడయినన్ నితంబినులఁ ౹ జాలును బొం దనువాఁడు గల్గునే. ౧౬ 1827

సీ. ఏ కాంతమునను నీతోవిట్లొనర్చినయల సంకేతమును మఱి స్వాంతరోగ
మును బెంచువాంఛను ౹ గనఁజేయు నీచూడ్కులను నవ్వుమోమును ౹ లక్ష్మికాట
పట్టయితగు నురోభాగంబు గాంచిన మా కెంతయొస్పృహ ౹ చేకురె మది
మోహ మెుందెడు; నీదుపుట్టుక వ్రజవాసిజనుల కెల్లను దుఃఖజాల మడఁప

ఆ. జాలుఁ జుమ్ము మఱియు ౹ సర్వప్రపంచమం
గళద మగును; గనుకఁ ౹ దలఁపులందు
నిన్నె గోరుమాకు ౹ నెఱి స్వజనహృదయ
వ్యాధిఁ బాపుమందు ౹ హరి! యొసఁగుము. ౧౭ 1828

క. అమందేదో యెఱుఁగుదు, వోమానితరూప! నీవె ౹ యూహించినచో;
గోమలతర యుష్మత్పద, తామరసము లార్త్రితాళి ౹ తాపహరంబుల్. ౧౮ 1829

చ. నిరుపమరూప! యోవికచనీరజనేత్ర! దయాసముద్రుఁడా!
గురుకఠినాస్మదీయకుచకుంభముల్ స్పృశియింప నొచ్చు నీ
చరణసరోజయుగ్మ మని ౹ చాల భయంబున మెల్లమెల్ల సుం
దరగతిఁదాల్తు మాయడుఁగుఁదమ్ములతో వని నీవు క్రుమ్మరన్. ౧౯ 1830

తే. కఠినసూక్ష్మపాషాణసంగతి నవెంత, నొచ్చునోయని మామదుల్ ౹ వెచ్చనూర్చు
చుండు నీవేకదా మాకునున్న జీవితంబు పేక్కేల మాటలు ౹ దైత్యదమన!

---

## ముప్పదిరెండవయధ్యాయము.

### శ్రీకృష్ణుఁడు గోపికలకు దర్శనమిచ్చుట.

క. ఈపగిది నవ్వనంబున, గోపిక లాకృష్ణుపైని ౹ గూర్మిఁ దదీయ
వ్యాపారంబులఁ బాడుచు, వాపోవుచుఁ జూచుకోర్కి ౹ వర్ధిలంగన్. ౧ 1832

క. పలవించి రప్పు డాకాం,తలకంఠరవంబు చారుతరమై చెలఁగెన్;
జలజాక్షుండును వారల, యలజడిమాన్పంగ సుస్మితాస్యాంబుజుఁ డై. ౧ 1833

క. పీతాంబరంబుఁ దాలిచి, చేతోభవమన్మథుఁ డని ౹ చెప్పందగు న
ట్లే తనువొప్పఁగ సుమమా, లాతతి ధరియించి కడువిలాసముమీఱన్. ౧౫

క. కనుపట్టె వారి మ్రోలను;, గనకాంబరధారి ప్రీతిఁగల్గించుచు వ
చ్చినఁగాంచి గోపికామణు,లనూన ముత్ఫుల్లనేత్రలయి యత్తఱినిన్. ౨౪ 1835

క. పోయినప్రాణంబులు రా, నేయనువునఁ దనువులలరు । నేద్రైఅ సట్లే
యాయంగన లొక్కుమ్మడి, నాయధిపుని మ్రోల నిల్చి । రాశ్చర్యముగన్. ౩

చ. కనఁబడ కెట్లొపోయి తము । గాసిలఁజేసిన యామనోహరుం
డనయము తారు కోరుహరి । యల్లన వచ్చి కనంబడంగ నా
వనితలలోన నొక్కతుక । వాంఛలుతీరఁగఁ జిన్నికృష్ణు దో
ర్వనజము దోసిటం గొనియెఁ । బంతముమీఱఁగ నెంతొవేడుకన్. ౩౪ 1837

చ. లలనయొకర్తు వేగమె వి।లాసముమీఱఁగఁ జందనంపుఁజ
ర్చలఁదగు కృష్ణబాహువును । జక్కఁగ మూఁపునమందుఁ జేర్చికొం
చలరె; మఱొక్కతన్వి వన।మందు హరిప్రియయైన బృంద యి
మ్ములఁ బ్రతికుంజమందిడిన । పూజ్యతరంబగు తమ్మలం బొగిన్. ౮ 1838

చ. హరి గ్రహియింప దానిగొనె । నంజలిఁబట్టి; మఱొక్కలేమయున్
విరహమహార్తిఁ గుందుటను । వేగమె శ్రీహరిపాదపంకజం
బురుతర తాపమార్ప ననుఁ।నూహ చెలంగ నురోజపీఠమం
దు రమణు లెల్లరుం గనఁగఁ । దోరపుభక్తిని దాల్చె నత్తఱిన్. ౫౮ 1839

సీ. కుటిలకుంతల యొకర్తు । కుటిలభ్రుకుటియయి ప్రేమభరంబున । నేమితోఁప
కట్టె విహ్వలయయి । యౌర! యిట్లొనరుపఁ దగునె యంచువచింపఁ । దలఁచినట్టు
లధరంబు గఱచి యాఁహరిఁ గొట్టఁగాఁబూను చందంబునం గటాఁక్షముల నట్టె
నిగిడించె; మఱియొక్క । నెలఁతమిన్నయు భక్తులాహరిపాదాబ్జ । మాశ్రయించి

తే. కనుచుఁ దృప్తినిబొందని।కరణిఁ దన్ము
ఖాంబుజము ఱెప్పపాటు లేనట్టిదృష్టు
లను గడుంద్రావియున్ మరఁలను మహాశఁ
ద్రావుచుండెను గాంచ దింతయును దృప్తి. ౭ 1840

ఉ. మానినియొకర్తు దృగ్వివరమార్గమునన్ బరమేశుఁ గృష్ణునిన్
మానససీమఁ జొన్పి పరమప్రమదంబునఁ గౌఁగిలించికొం
చూనినశ్రద్ధఁ బైఁ జనక । యుండఁగఁ గన్నులుమూసి యోగిచం
దాన ముదంబుమగ్నయయి । తాఁ బులకల్ మెయినిండఁగాఁ దగెన్. ౮ 1841

వ. ఇట్లు లాగోపికలా శ్రీకృష్ణునిం గాంచినంతనే పరమోత్సవ నిర్వృతలై మహా
నందంబు పైఁబొలయ విశ్వతైజసదశనున్న జీవులు సుషుప్తిసాక్షియగు ప్రాజ్ఞునిం
గాంచుచందంబునను, బరమేశ్వరుంగాంచిన ముముక్షువులకరణిని, బ్రహ్మజ్ఞునిం
గాంచినసంసారులభంగిని వియోగవ్యథంబాసి యుండి రంత. ౯ 1842

క. వినుమవలివార్త వత్సా!, వనజాక్షప్రీతిపాత్ర! ॥ భగవంతుం డా
వనితలు విగతవ్యథలై, తనుఁ గూడియె కూరుచుండఁ ॥ దదోద్యోగమునన్. ౯౫

తే. పరమపురుషుండు సత్త్వాది॥నిరుపమాన
శక్తులంగూడి యుండెడు ॥ చందమునను
బూర్వమునకంటె మిక్కిలి ॥ పొలుపుఁ గాంచె;
నంత వారలఁదోడ్కొని ॥ యచ్యుతుండు. ౧౦ 1844

క. కాళిందీపులినమునకు, శ్రీలీలాస్పదుఁడు పోయెఁ ॥ జెచ్చెర నచటం
జాలుగఁ బూచిన మొల్లలు, క్రాలెడుమందారములు ని॥కామము తనరెన్. ౧౦౫

క. ఆపూవులతావులతో, నేపారఁగ వీచుపవను ॥ నెంతయుఁ బ్రీతి
వ్యాపారంబుల భృంగము, లాపోవనితృప్తి వ్రాలి ॥ యమలధ్వనులన్. ౧౧

తే. ఒక్కమొగిఁ జేయుచుండె న॥ట్లొప్పుచున్న
యాశరత్కాలమందు శీ॥తాంశువిమల
చంద్రికలు నిండఁ జీఁకట్లు ॥ సమసి పోవఁ
బరమమంగళనిలయమై ॥ పరఁగె నదియు. ౧౧౫ 1847

క. స్రోతస్విని తన యలలను, చేతుల నెంతయును బ్రోఁగు॥చేసిన సూక్ష్మం
బైతగు సైకత మచ్చోఁ, బ్రీతింగూర్చుచును మిగుల ॥ వెలయుచునుండెన్. ౧౨

చ. పులినతలంబునందు నటఁ ॥ బూవిలుకానియనుంగుఁదూపులై
యలరెడు నానితంబినులు ॥ హర్షసముద్రునిఁ గృష్ణుఁ గాంచి యి
మ్ముల హృదయవ్యథల్ తొలఁగి॥పోవఁగ నప్పరమాత్ముఁ జూచి ము
జ్జలనిధిఁదేలు వేదముల॥చందముమీఱ నవాప్తకాములై. ౧౨౫ 1849

క. సంతోషాంబుధిఁ దేలిరి;, వింతగ నాత్మలకుఁ జూడఁ ॥ బ్రియబంధులెయా
కాంతున కా శ్రీకృష్ణున, కెంతయు సంతృప్తిమీఱ ॥ నింతులు త్వరగన్. ౧౩

క. స్వోరోజకుంకుమాంకిత, చారుత రామూల్యమృదువ॥సనముల తుదలన్
గోరిక నాసనమును జే,కూరిచి ధన్యతమలైరి; ॥ గోపాలకుఁడున్. ౧౩ 1851

సీ. యోగేశ్వరుల మాన॥సోత్ఫుల్లపుండరీకాంతరమునఁ గల్పి॥తాసనుఁడయి
యలరారు నీశ్వరుం ॥ డాభగవంతుఁడు వనితాప్రకల్పి తా॥సనవరమున
బలసి గోపికలెల్ల ॥ వరుసఁ గూర్చుండి తన్నర్చింప లోకత్ర॥యమునఁ గల్గు
లావణ్యమునకు నెల్లను దానె వసతియై తనరారునాకార॥మున వెలింగె;

తే. వాంఛ లుల్లసిలన్ జేయు॥వాసుదేవు
నచ్చటం గాంచి మందస్మి॥తాంకురములఁ
గులుకు లీలేక్షణములఁ జెన్నలరుబొమల
తోడ నాహరిఁ బూజించి ॥ కూడియుండి. ౧౪౫ 1852

క. సురుచిరకోమలహారిపద, సరసిజముల స్వాంకములను ౹ జక్కఁగ నిడికొం
చు రమణ మెల్లఁగఁ బిసుఁగుచుఁ, దరుణులు తొలుత నుతించి ౹ తాపముపోల [యన్.

ఆ. సుంత కోపమూని ౹ సొగసుగఁ బల్కిరి;
కోమలాంగ! ధరణిఁ ౹ గొందఱు తముఁ
గొలుచువారిఁ దమరు౹గొలుతురు; కొందఱు
కొలువకున్న వారిఁ ౹ గొలుతురుసుమ. ౧౫౪ 1854

[1]క. వినుమా యింకం గొందఱు, జనులు తముం గొల్చునట్టి౹జనులం గొల్వం
గనుఁగాని జనుల నుభయుల, ననువొందఁగఁ గొల్వ రిందు ౹ నంతర మెదియో?

క. తెలుపుము మాకుం జక్కఁగ, జలజాక్షా! యేదిసాధు౹సరణియొ యని యి
మ్ముల స్వాభిప్రాయంబుం, దెలుపఁగ నాలించి పలికె ౹ దేవవిభుండున్. ౧౬

క. చెలులార! యొకరినొక్కరు, కొలిచిన మఱి కొల్చువారు౹కొంకక స్వార్థం
బులఁ గోరువారలే యని, తలఁపం జనుఁ గాని వేఱు౹తలఁపం జనునే? ౧౬౪

క. తమునొక్కరు సేవించిన, తమ రవ్వారలను గొల్వఁ ౹ దలఁచుట సుమన
స్త్వము గాదు దానఁ గనధర్మములేదు స్వకార్యమున ని౹రతియె కనఁబడున్.

క. పరులకు నుపకృతి యొనరిచి, పరమంబగు ధర్మమార్గ౹పాలనము నొన
ర్చురతియు నటఁ గనరా; దెవ్వరు స్వార్థముమాని పరులఁ ౹ బాలించుతమిన్.

క. కరుణ గలవారలగుచుఁ బితరు లాత్మభవులనుబోలెఁ ౹ దమ్ముఁ గొలుచునా
తురతఁ గననట్టివారలఁ, బరమాదృతిఁ గొలుతు రట్టి౹వారల కెల్లన్. ౧౭౪ 1860

సీ. నిరపవాదంబయి ౹ నెగడెడుధర్మము సౌహృదమును గల్గుఁ ౹ జానలార!
సర్వభూతములందుఁ ౹ జక్కనిభావంబు గలుగును; గొందఱు ౹ లలిని దమ్ముఁ
గొలిచినను వారిఁ౹గొలువరు వా రికఁ గొలువనివారలఁ ౹ గొలుతురెట్లు?
వీరెల్ల నాలుగు౹విధముల విభజింపఁబడుదురు; జ్ఞానైక౹పరత నొప్ప

తే. నలరునట్టి యాత్మారాము౹లనియు భోగమందునిచ్ఛయె లేకుండ౹నలరుపూర్ణ
కాములనియుఁ గృతఘ్నులుఁ ౹ గఠినతములు, ననియు వారికిఁ బేరు లో౹యతి

[2]మ. చెలులారా! యిఁక నాదుమాట వినుఁడీ ౹ చేఁ జిక్కి యర్థంబుసం [వలార.
చలనంబై చన దానిపైఁ గలతమి౹స్వాంతంబు వేఱొక్కఁడుం
దలఁపంగానకయుండఁ దత్తఱిలుచు ౹ దైన్యంబుచూపట్టు వ
ర్తిలునిస్స్వుం డన నన్నుఁగొల్చు జనుల ౹ దీపాఱుప్రేమంబునన్. ౧౯౪ 1862

క. నేనును గొలువ నదే లనఁ, గా నన్నే యంతరంబు ౹ గన్పడనితమి

1 "భజతోను భజంత్యేక ఏకఏతద్విపర్యయం, నోభయాంశ్చ భజంత్యన్య ఏతన్నో బ్రూహి సాధుభోః" అని మూలము. 2 "నాహంతుసఖ్యో భజతో౽పిజంతూన్ భజామ్యమీషామనువృత్తివృత్తయే, యథాధనోలబ్ధ ధనే వినష్టే తచ్చింతయాన్యన్నిభృతోనవేద" అని మూలము.

ధ్యానంబుచేయఁదగు నని, యే నేఁ గన్పడకయుందు । నిది తప్పెటులొ? ౨౦
క. కాదుకృతఘ్నత యిదియని,యే దలఁపఁగ వలయు మీరలి త్తఱిఁ జెలులా
రా! బారుణవనమున నిట, నాదారిం దెలియ నెమ్మనములఁ దలఁచుచున్.
క. ఇది యుక్తమె యగు; మఱి యీ, యదియునయుక్తంబె యరయఁనగు; నని సుంతై
నఁ దలంపక లోకము ని,య్యది ధర్మమధర్మమనుచు । నరయమి శ్రుతులన్.౨౦౫
తే. మీరుపాటింప నందున । మేటిబంధు, జనుల దిగనాడినందున । ననుభజించు
నిష్ఠగలదని యెంచితి । నేను దాని, నరయఁ గనఁబడకుండితి । నని తలఁపుఁడు.
క. కొలుచుచునుంటిని మిమ్మని, తలపోయుఁడు ప్రీతిఁ గన్న । తరుణులు గానన్
గలఁదు ప్రియం బెద మీయం,దలఘుతరం బంచు నరసి । యపరాధముగన్.
క. మనముల నెన్నకుఁడీ యి,ట్లనుదితకపటప్రమోద । మంది ననుం గొ
ల్చినమీకు మిక్కుటం బనఁ, జను నుపకారంబుచేయఁ । జాలితినేనిన్. ౨౧౫
తే. సురలుజీవించునందాఁక । సొరిదిఁ జేయ, శక్యమేకాదు; విడువంగఁ । జాలనట్టి
సద్మశృంఖలముల వీడి । సాధుభక్తి, నన్నుఁ గొలువంగ వచ్చితి । రిన్నిశ నిటు.
తే. ఇట్టి మీయుపకృతికి నో । యింతులార, మీసుశీలతయే యెన్న । మేటిప్రత్యు
పకృతియగు గేహశృంఖలా । ప్రతతి వదలి,పోవు మీకని పలికె శ్రీ । భూధవుండు.



ముప్పది మూఁడవయధ్యాయము.

రాసక్రీడ.

క. వనజాక్షుఁడు భగవంతుఁడు, మనములకున్ సొంపుగూర్చు । మాటలు పలుకన్
వినియుఁ దదంగస్పర్శం,బును గనియున్ విరహతాపమును బాసి రొగిన్. ౧
*[సీ. నానాజగంబుల । నర్తకుండునుబోలె నాడించుగోవిందుఁ । డాతరుణము
నందు రాసక్రీడ । నలరారఁగా నెంచెఁ బ్రకృతిషే నర్తకి । పరమపురుషుఁ
డగు; సూత్రధారుఁ డీయర్థము దెలుపంగ నభినయించెడునదియగును రాస
మన నందు నర్తకీహర్షంబు చెలువొందుఁ బరమేశ్వరుఁడు భక్తపాలకుండు
ఆ సాక్షిమాత్రుఁడగుచు । నక్షిగోచరుఁడయి, వారిగూడియుండు । వరుస యిదియె
రాస మనెడుపేర । రంజిల్లు క్రీడకు, నీశు శక్తిగనుటె । యిందుఫలము.] 1872
క. తరువాతన్ గోపాలుఁడు, హరియు ననువ్రతలు నగుచు । నధికప్రీతిం
బరఁగుచు వర్తించెడు నా, తరుణీరత్నములఁగూడి । తత్పులినములన్. ౧౫
క. వరుసఁ బరస్పరవరకర, సరసిజములఁ బెనఁచికొనుచుఁ । జానలు కొల్వన్
నిరుపమరాసక్రీడా, పరతన్ మోదింపఁ దొడఁగె । భక్తులఁ దేల్పన్. ౨ 1871

* సకలవ్యాఖ్యానాభిప్రాయసార మిందుఁగలదు.

గు. వరుసన్ వారల మండలాకృతిగఁ జెల్వంబొప్పఁగా నిల్పి యి
ద్దర మధ్యంబునఁ దా నొకండుగ లసద్భ్రాజంబునన్ నిల్చి యా
సరసీరుణ్ణయనాద్వయాంసముల హస్తద్వంద్వముల్ మోపి సుం
దరరాసోత్సవ సంప్రవృత్తి నడపెన్ దామోదరుం డత్తఱిన్. 3 1875

*సీ. యోగేశ్వరుండయి యొప్పునా శ్రీకృష్ణుఁ డత్యంతశక్తిఁ దాననలరుచుంట
నాకామినీమణు లత్తఱిఁ దమయొద్ద నిలుచుండి తమ్మె యిమ్ములను గౌఁగి
లించుకొనియె యుండు నంచు నొక్కొక్కతె తలపోయునట్లుగఁ దా నెసంగె;
నామహోత్సవదర్శనాసక్తమతులయి నిర్జరుల్ తమతమ నీరజేశు

తే. లలను గూడియె వ్యోమయానముల నెక్కి
యంబరంబున నెల్లెడ నావరించి
యుండి; రంతట దుందుభు లొక్కసారి
మొరసె సుమవృష్టి యెల్లెడఁ గురిసె నంత. ౪ 1876

క. వెను వేడుక గంధర్వులు, వనితాయుతులగుచుఁ గృష్ణుభవ్యయశంబున్
మనముల నెసంగుభక్తిని, వినుతించిరి గేయములను విస్తృతి గనఁగన్. ౫

చ. అనుపమ రాసమండలమునందుఁ జెలంగెడు నర్తనంబునన్
వనితలు తత్ప్రియుండయిన వారిజనేత్రుఁడుఁ బ్రీతిమీఱఁ దా
ల్చిన వరకంకణంబులును జిత్రమనోహరనూపురాదులం
గనఁదగు కింకిణుల్ తుములక్రమనినాదము లొప్పఁగాఁ దగెన్. ౬ 1878

మ. భగవంతుం డగు దేవకీసుతుఁడు తత్పద్మాక్షులంగూడి హై
మగరత్నంబుల యంతరంబున రుచుల్ మైకొన్న నీలాఖ్యమై
సొగసుంగుల్కెడు రత్న మట్లు మిగులన్ శోభిల్లె నాకాంతలున్
దగ భాసిల్లిరి తత్ప్రభాయుతి నితాంత స్ఫారతేజంబులన్. ౭ 1879

సీ. ఆ రాసవిహరణమందుఁ గృష్ణునిగూడి మానినీమణులెల్ల మండలాకృ
తిని గృష్ణుచందంబునను బదన్యాసముల్ గనఁబడఁ జేయుచుఁ గమ్రహస్తచు
ములను ద్రిప్పుచు స్మితంబుల నందములుగాఁగ భ్రూవిలాసముల నింపులఁగులుకు
నడుములు గదల స్తనంబులు పైఁటలోఁ జలియించుచుండ వస్త్రములతుదలు

ఆ. చెదరుచుండ గండసీమలఁ గుండల, కాంతు లొలయ వదనకంజములను
స్వేదబిందురాజి చెలఁగఁ గ్రొమ్ముడులను, సడలకుండఁ గట్టి సరభసమున. ౮

క. మొలనూళ్లు వదలకుండఁగ, విలాసమొప్పన్ బిగించి వెన్నునిచరితం
బులఁ బాడుచు జలధరమండలమున విద్యుల్లతాళినాఁ జిత్రముగన్. ౮ 1881

* "యంమన్యేరన్నభస్తావద్విమానశతసంకులం, దివౌకసాం సదారాణా మాత్సుక్యాపహృతా
త్మనాం" అని మూలము.

క. లీలామానుషవిగ్రహుఁ, డై లలిఁ జెలువారు కృష్ణునంతరమున వా
రోలి వెలింగిరి; తరుణీ, జాలము లటు మోదమున నోసంగుచు మిగులన్. ౬

క. నానావిధ రాగంబుల,చే నెంతయు గళములు విలసిల్లఁగ నాట్యం
బూని యొనరించుచుఁ హరి, మానితతనుసంగతిఁ బ్రమద మొప్పారన్. ౭

క. ఎలుఁగెత్తి పాడి; రాపా,టలగంధుల నాదమే కడంగి జగమ్ముఁ
విలసిల్లి యావరించెను, గలకంఠి యొకర్తు కృష్ణకలనాదముతోన్. ౮ 1884

క. తనగళనాదము తోడయి, కనఁబడఁగాఁ బాడఁదొడఁగి కంజాక్షుఁడు మే
లని పలుమఱు పొగడఁగ నా,తనిస్వరములతోడఁ గలియఁదలఁపనిరీతిన్. ౯

తే. షడ్జమాదిగఁ గల్గిన స్వరవిభేద
ములను ధ్రువతాళసంయోగమునను జక్కఁ
బాడె నాపాట కెంతయుఁ బ్రమద మొదవ
గారవించె శ్రీకృష్ణుఁ డౌరౌర! యనుచు. ౧౦ 1886

చ. సురుచిరగాత్రి యొక్కొతుక సొంపుగ రాసవిహారమగ్నయై
కరము పరిశ్రమంబుగని కంకణముల్ చలియింపఁ గ్రొమ్ముడిఁ
బెరసినమల్లికాకుసుమబృందము వీడఁగ బార్శ్వమందు ను
న్నరమణు మూఁపురంబుపయి నైజకరం బమరించి నిల్చెఁ దాన్. ౧౧ 1887

చ. కలువలవాసనల్ మిగుల గందపుఁబూఁతలఁ జెల్వమించు దో
ర్జలజముఁ గృష్ణుఁ డొక్కవ్రజసారసనేత్ర భుజంబుఁ జేర్పఁగా
నెలమిని మూరుకొంచు నలయింతి శరీరము హృష్టరోమమై
వెలయఁగ ముద్దుపెట్టుకొనె వెన్నుఁడు తన్ను బహూకరింపఁగన్ ౧౨ 1888

చ. అతివయొకర్తు నర్తనమునందుఁ జలించెడుకుండలంబులఁ
బ్రతి యరయంగలేని ఛవిపర్వఁగ గండయుగంబు వింతయా
కృతి గనఁ గృష్ణుగండమున నెంతయు నేర్పునఁ జేర్చె దాన స
మ్మతి విడియం బొసంగి బహుమానముఁ జూపెను నందబాలుఁడున్. ౧౩ 1889

ఆ. రమణియొకర్తు నూపురములు కాంచీదామ
కింకిణులు ధ్వనింపఁ బొంకముగను
నాడి పాడి యలసి యటనున్న శుభహరి
హస్తపంకజ మెద నదుముకొనియె. ౧౪ 1890

సీ. తక్కినగోపికల్ మిక్కిలిప్రీతుఁడై సిరి కొక్కతికె మనోహరుఁడు నగుచు
నచ్యుతుండయితగు నాహరిఁ గాంతునిగఁ బడసి తత్కమ్రకరసరోభ
వాలింగితగ్రీవలయి కృష్ణచరితముల్ పాడుచు నర్తనపరత మిగుల
విహరించి; రత్తఱి వెలఁదిమిన్నలు కర్ణములయందుఁ జెలువంబు గులుకనునిచి

కొనిన యుత్పలములు కుటిలాలకవిలాస మమరుకపోలముల్ చెమటబిందు
వులును మోములకు సుజ్జ్వలతరశ్రీలఁగూర్పంగఁ గంకణనూపురములు సూక్ష్మ
కింకిణీజాలమ్ముఁ బొంకముగా ధ్వనుల్ గలిగించుచుఁ వాద్యములయి చెలఁగ
ఝుంకారములుసేయ షట్పదములు గాయకులుగాఁగ రాసగోష్ఠులను గేశ

తే. పాశములనుండి మృదులపుష్పస్రజములు
జాఱుచుండంగ భగవంతు సారసాక్షుఁ
గలిసి నృత్యంబు చేసి రక్కరణి శ్రీని
కేతనుఁడు భగవంతుఁ డాకృష్ణుఁ డపుడు. ౧౬ 1891

చ. వనితలఁ గౌఁగిలింతలను బాహులతాగ్రహణంబులన్ మనో
జ్ఞనయనవీక్షణంబులను సాధువిలాసములన్ బ్రమోదసం
జనకములైన హాసములఁ జక్కఁగఁ దేల్చుచు నర్భకుం డొగిం
దనప్రతిబింబముం గనుచుఁ దా విహరించుగతిం జెలంగుచున్. ౧౭ 1892

తే. కరముహర్షించె స్వీయాత్మకలగు టరసి, భామినులు కృష్ణునంగ సంస్పర్శములను
బరవశములయి యింద్రియోత్కరము లొప్పఁ, బ్రమదవారినిధిం దేలి రమల [గతుల.

చ. పరవశలౌట మాల్యములు భాసురరత్నకలాపముల్ మనో
హరతరనృత్యహేతువున నల్లన జాఱుచునున్నఁ జక్కఁజే
యురతిని బూనరైరి కుచ లొయ్యన వీడఁగ నీవిబంధముల్
గురుకుచపట్టికల్ మృదుదుకూలములున్ సడలంగ నత్తఱిన్. ౧౮ 1894

క. వానిం జక్కంబఱుపం, బూనరు వారించుకేని బుద్ధులు హరియం
దే నిల్చియుండుటన్ మఱి, శ్రీనిలయునిలీలలఁ గని చెందినవేడ్కన్. ౧౮

*క. సురవర్త్మమునఁ జెలంగు ఖచరకాంతలు మోహపరవశతఁ గాంచిరి ని
ర్భరవాంఛ లార్తిఁ గూర్పఁగ, సరసిజరిపుఁ డితరఖేటసంయుక్తుం డై. ౧౯ 1896

తే. విస్మితుండయ్యె; నత్తఱి విష్ణుమూర్తి, గోపికలసంఖ్య యెంతో స్వరూపమంత
సంఖ్య నమరంగఁజేసి స్వశక్తి వెలయఁ, గడు విలాసముమీఱ నిక్కమగు నట్లు.

తే. వారితోఁడ నాత్మారాముఁ డై రమేశుఁ,డై యచింత్యవిభూతియు నై తనరియు
విహరణముసల్పె; నత్తఱి వెలఁదు లెల్ల, రతివిహారమ్మునం బరిశ్రాంత లగుట.

క. కనుఁగొని శ్రీకృష్ణుం డా, వనితల నెమ్మోములను స్వభావముగఁ గృపా
వనరాశిగాన సుఖము నె, గనఁజేసెడు నాత్మహస్తకంజమునఁ దగన్. ౨౧ 1899

క. శ్రమజనిత ఘర్మకణములు, తమంతనే మాఱ్పనొందఁ దగువిధముననే
నిమురుచుఁ దనహృదయమునం, దమరినప్రేమమును జూపె నాగోపికలున్.

సీ. పరమేశ్వరుని చారుకరరుహస్పర్శనముల వెల్లివిరియు ప్రమోద మొప్పఁ

* "కామార్దితాశ్శశాంకశ్చ సగణోవిస్మితోఽభవత్" అని మూలము.

గనకకుండలరోచు ॥ లనుపమానాలకద్యుతిసంపదలు పర్వ ॥ నుతికెదగిన
గండభాగముల ప్ర॥కాశంబునన్ సుధాయితహాసనంయుత ॥ దృగ్వితతిని
హరికిఁ బ్రమోదంబు ॥ నలవరించుచుఁ దదుద్గీతములం బాడి॥రాతరుణుల
తే. యంగసంగమ సమ్మర్ది॥తాకృతియయి, వారివక్షోజకుంకుమ ॥ సారరంజి
తమయియొప్పెడుపుష్పహా॥రమును దగిలి,గండుతుమ్మెదపిండుఝుం॥కారములను.

[1]క. వరుసఁజెలంగఁగఁ జేయుచు, నరిగెను గంధర్వనాథు ॥ లట్టులు పరమే
శ్వరుఁడును క్రీడాయాసముఁ, దరుణులతోఁ బాపుకొనఁగఁ ॥ దలఁచి జవమునన్.

[2]క. కరిణీసంఘముతోఁ జను, కరివరువలె జనులవాడు॥కలఁ గైకొనకే
యరిగెను జలములఁ దమిని వి,హరణము సలుపంగఁ దానె ॥ యఖిలం బయ్యున్.

జలక్రీడలు.

వ. సుందరమందగమనంబున గజేంద్రలీలల ననుకరించుచు నమ్మడువునం బ్రవేశించి యమ్మత్తకాశినులు మోదమానమానసలై యున్మత్తకరేణుకలచందంబునఁ బకపక నవ్వుచుఁ బరిహాసము లొనరించుచుఁ బ్రేమోత్కంఠితలై తనపయిన్ జలంబులం జల్లిన వెల్లివిరియుమోదంబున వారిపయిఁ దాను సలిలంబులం జల్లుచు, నంబరంబున విమానరాజంబులందుండి విబుధరాజులు పుష్పవృష్టిం గురియించి వినుతింపం బ్రమోదించుచు, నంతఁ జెంతనున్న యుపవనంబునం గలపూవులయు హ్రదంబునంగల కలువపూవులయుఁ బరిమళంబులు తమయందుఁ బర్వ గంధవహనామంబు సార్థకంబుగా నల్లనల్లన వీచు సమీరకిశోరంబులు తమపైఁ బొలయ నానందించుచు, నాపూవుంబోఁడులును దేంట్లును బిండుగాఁ జేరిరాఁగ గంధగజేంద్రంబు కరేణువిసరంబుతోఁ జరించుచందంబున నాశ్రీకృష్ణుం డందుఁ జరించుచుండె నంత. ౨౫ 1904

క. సూనృతసంకల్పుం డగు, శ్రీనిలయుఁడు స్వానురక్తిఁ ॥ జెందిన స్త్రీసం
తానము తన్నుం గొల్వం,గా నెలమిఁ దదీయసాధు॥కాలజ సుఖముల్. ౨౫౪

[3]ఆ. కావ్యవర్ణితములు॥గాఁ దగురసములు, గలిగి వెలయు తన్ని॥శలను వారిఁ
గలిసి తిరిగియును వి॥గతరతిరసుఁడయి, నిర్జితేంద్రియుఁడయి ॥ నెగడుచుండె.

క. అని శుకయోగి వచించిన, వినిన పరిక్షిత్తు మిగుల॥వేడుకఁ బ్రశ్నిం
చెను యోగివర్య! ధర్మం,బును నిల్ప నధర్మము నిలఁ ॥ బూన్కి నడంపన్. ౨౬౪

క. తనయంశముతో మేదిని, జనియించినవాఁడుగాదె ॥ జగదీశుం డ

1 "గంధర్వపాళిభిరనుద్రుతఆవిశద్వాః" అని మూలము. "గంధర్వపాగంధర్వపతయఇవ" అని వ్యాఖ్య. 2 "ఇభరాడివభిన్నసేతుః" అని మూలము. "స్వయంచాతిక్రాంతలోక వేదమర్యాదః" అని వ్యాఖ్య. 3 "ఆత్మన్యవరుద్ధసౌరతః" అని మూలము. "ఆత్మన్యేవావరుద్ధస్సౌరతశ్చరమధాతుసతు స్ఖలితో యస్యేతి కామజయోక్తిః" అని వ్యాఖ్య.

వ్వనజాక్షుఁడు ధర్మంబున,కును దగుమర్యాద లెవియొ కోరిక వానిన్. ౨౬

క. తానె యనుష్ఠించుచు నోగి, మానవులకుఁ దెల్పుచును సమస్తవిధములన్
వానిని గాపాడుచు న,జ్ఞానులఁ దూలించుచుండఁ జనుఁగాదె మునీ! ౨౭

క. ధరణీవిబుధేంద్రా! యిపు, డరయఁగ ధర్మమునడంప ననువయి తగునా
చరణముగాదే యిదియుం, బరదారలనున్ స్పృశింపఁ బాల్పడు టెల్లన్. ౨౮

ఆ. దాని నాచరించెఁ దగునని యడియెట్లు, మంచి దనఁగఁ దగును మానివర్య!
యాప్తకాముఁడయ్యు నతినిందితమగు కా,ర్యము నొనర్చె నేమియాశయంబొ.

తే. సువ్రతా!మాకుఁ గల్గినచొప్పుఁ దెలియ,నట్టియీసంశయంబు నిస్సంశయము వోనట్టి
వడఁగఁజేయుము నా విని యమ్మహాత్ముఁ,డతని సందేహమును బాప నాత్మనెంచి.

చ. విను మని యిట్లుపల్కెఁ బృథివీవర! యీశ్వరులైనవారి యం
దనయము సాహసంబు గననయ్యెడు ధర్మవిధిప్రకాండమున్
మనములఁ దోఁచినట్టు లనుమానము లేక యొనర్చుచుండుటల్
గనఁబడు నట్టులయ్యును; నికామము తేజముగల్గి యుండుటన్. ౨౯ 1913

క. అనలుం డెల్లపదార్థము,లను భక్షించియును నుజ్జ్వలంబగు తేజం
బునఁ గొఱంత గాంచనట్టులె, ఘను లద్దానిన యఘంబుఁ గాంచరు సుమ్మా! ౩౦

సీ. ఈశ్వరుల్ చేసిరే యేమొనర్చిన నేమి యంచు ననీశ్వరుఁ డైనతంబు
శాస్త్రవశ్యుఁడు నగుజనుఁ డొకప్పుడునైన నట్టికార్యమ్ముల నాత్మయందు
నైనఁ జేయఁగరాదు మానక చేసినఁ జెడిపోవుఁ జుము మును క్షీరవార్ధి
హాలాహలము పుట్ట నద్దాని నీశుండు భక్షించెనని లాఁతివాఁడు తినిన

తే. వెంటనె నశించుఁగాదె; యోవిమలచరిత!
యట్టులైన సదాచార మనఁగ నెట్టి
దట్టిదానికిఁ బ్రామాణ్య మెట్టుగల్గు
ననుచు శంకింతువేమొకో వినుము శ్రద్ధ. ౩౧ 1915

క. జనవర! యీశ్వరు లగుచుం, దనరుచునే కర్మవశ్యతం గనని ఘనుల్
మనములఁ దలంచి చెప్పు వ,చనములు సత్యంబులె యగు సతత మ్మవనిన్. ౩౨

ఆ. వారివాక్యములకును వారియాచారమే
యది పొసంగియుండు; నదె ప్రమాణ;
మట్టిదానిఁ గొనఁగ నగుఁ గాని యన్నియా
చారములను గొనఁగఁ జన దెవరికి. ౩౩ 1917

క. మతిమంతుఁడయిన నీశవి,హితవాగనుకూల మగుచు నెసఁగెడునెదియా
హితచరితమునె గొనందగు, హితమగు నద్దానిచేత నెంతయు రాజా! ౩౪

క. ఏయది వారల వాక్యన, కే యవిరుద్ధంబుగాక యే చేయఁగ నొ

నాయాచారముఁ గొనఁ దగ,దోయవనీనాథ! యెట్టి యుద్యమమందున్. 33

సీ. *అధికతేజోవంతులై నిరహంకారు లగువారు విధిఁజేయునట్టికృతిని
నొక్కయర్థముగల్గ దొప్పనిరీతిగా నాచరింప ననర్థ మావహిల్ల
రమరమానవతిర్య గాధిభూతాళికిఁ దా నియామకుఁడయి తనరుచున్న
జగదీశ్వరునకుఁ గుశలకర్మమున సుఖ మకుశలకర్మమునందు దుఃఖ

ఆ. మొదవు ననుచుఁజెప్పు టొప్పునే; యేదేవు
పాదకమలరజము భక్తిఁ గొలిచి
నిత్యతృప్తు లగుచునెగడి మునుల్ మోహ
మొగిని బాసి స్వేచ్ఛఁ దగుచునుంద్రు. 3౪ 1920

క. ఘనయోగమహిమమునఁ గర్మనిచయబంధములఁ బాసి మహితసుఖంబుం
గనుదురుగాదే; మానవ,తను వాత్మవిలాసముననె తాల్చిన హరికిన్. 3౫

ఆ. కర్మబంధ మెట్లు గలుగు? నవాప్తకా
ముఁడగు హరికిఁ బరులమోహానాంగు
లను గ్రహింపఁ జనునె యనుచుఁ బ్రశ్నించితి
వట్టిగోపికలకు నరసి చూడ. 3౫ 1922

క. వారలపతులకు మఱియుఁ, ధారుణిఁ జూపట్టుభూతతతులకు నెల్లన్
వారిజనేత్రుఁడు లోపల, నారూఢిగనుండి తా నియామకుఁ డగుచున్. 3౫౪

క. అలరెడు సర్వాధ్యక్షుం, డిల లీలార్థంబు దేహమెత్తెను గానం
గలుగదు మోహము తగు క్రీడలఁ దేలెడు నుచిత మది కడంకం గనినన్. 3౬

ఆ. హరి యవాప్తకాముఁ డంటివి; క్రీడాది
కమ్ము లతనికేల నిమ్మహి నని
యడఁగఁ దలఁతువేమొ యఖిలభూతానుగ్ర
హార్థమయియె మానవాకృతిఁ గని. 3౬౪ 1925

క. తదుచితములైన క్రీడలఁ, బొదలుచుఁ దా నుండు వానిఁబొందుగ విని స
మ్మదమున భక్తిని గాంతురు, సదమలమతు లట్టులౌటఁ జన దఘ మనఁగన్.

సీ. వ్రజమున నుండెడువారెల్ల నమ్మహాపురుషుని మాయాభిభూతు లగుచు
గోపాలకులు తమకువలయనేత్రలు కృష్ణుపజ్జకు నేగి యొలమినుండు
టెఱుఁగక తమకడనే యుండినట్టులు భావించి రందున వారిజాక్షు
నం దపరాధంబు నావహింపఁగఁ జేయరైరి; బ్రాహ్మముహూర్త మంతరాఁగ

* "కిముతాఖిలసత్త్వానాం తిర్యఙ్మర్త్యదివౌకసాం, ఈశితుశ్చేశితవ్యానాంకుశలాకుశలాన్వయః"
అని మూలము. దీనిసారమే యిందుఁగలదు.

